ఉన్నంతవరకూ ఒకదమ్మిడీ అయినా ఖర్చుపెట్టనియ్యలేదు. ఆమె పోయిన తరవాత, అప్పటికే పన్నెండేళ్ల పిల్ల కూతురికి పెళ్లి చేసేసు. తరవాత నాలుగయిదేళ్ళలో దురదృష్ట వశాత్తు, ఆమెకు వైధవ్యం ప్రాప్తిస్తే అదంతా శంకరశాస్త్రుల్లు ముసలివాడికిచ్చి పెళ్లిచేసిన కక్కుర్తి ఫలితమే అంటారు కొందరు అయినా వాళ్లకి అసలు విషయమేమిటో తెలిస్తే కదూ, తమంటే గిట్టక ఏదో అలా అంటారంతే

కూతురు తిరిగి వచ్చిన తరవాత ఒక ఏడాది పాటు బాగానే ఉంది తన స్థితికి తగినట్టుగా తర వాత కాశీయాత్రకి వెళ్తానంది ఒక వారంరోజులు పాటు ఆలోచించి, ఇక దానికి ఐహిక జీవితంలో మరేమీ అవలంబనం లేదు, ఎప్పటి కయినా ఆముష్మికం చూసుకోవలసినదే కదా అని, డబ్బిచ్చి తగిన పెద్దవాళ్లతో కలిపి పంపాడు ఆ వెళ్లడం కూతురు ఎవరితోనో లేచిపోయిందనీ, యాత్ర అన్నది కేవలం ఒక మిష అనీ, తెలిసింది 'సరే, దాని మొగుడితోపాటు అదీ పోయిందనుకుంటా' నన్నాడు శంకరశాస్త్రుల్లు

ఇప్పుడు బాగా పెద్దవాడయి పోవడంచేత ఎక్కడికీ కదలలేడు ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాడు, ఉంటాడంటే ఊరికే గోళ్లు గిల్లుకొంటూ కూర్చుంటాడా? పెరట్లో అన్నిరకాల కాయగూరలూ పండిస్తాడు. తనకు ఎక్కువయినది అమ్మేస్తాడు, ఓపికగా బియ్యపుగింజలు ఒక్కొక్కటే ఏరుకొని, వండుకొని, భోంచేస్తాడు, ఒక్కపూటే రెండవ పూట ఏదో ఒక పండుతిని కొద్దిగా మజ్జిగ తాగుతాడంతే.

ఇప్పుడు మునపటి ఆ వసూలు చేసుకొనే ఓపికా, జ్ఞాపకశక్తి తగ్గిపోవడంవల్ల, కేవలం బంగారం వెండి వస్తువులమీద తప్ప డబ్బు ఇవ్వడం మానుకొన్నాడు అతని దగ్గర డబ్బు తీసుకొని వెళ్ళిన ప్రతివాళ్ళూ అంటూ ఉంటారు. "ఇంత ముసలివాడయేడు. నా అన్నవాళ్లెవరూ లేరుకదా ఎందుకంత డబ్బు కక్కుర్తి చెప్మా?" అని కాని, ఆ కక్కుర్తివల్లనే, తనకు ఆమాత్రం అప్పు ఇయ్యగలపాటి డబ్బు చేరిందనీ, అతడు అందరిలాగే సామాన్యమయిన జీవితం గడిపి ఉంటే, అందరికంటే దరిద్రుడుగానే ఉండునని గ్రహించరు

అతని జీవిత వివరాలు తెలుసుకొన్న తరవాత అతన్ని చూసి ఎలా ఈర్ష్యపడటం? మళ్లీ నా జీవిత మంతా మొదటనుండీ బతకడానికి సావకాశం ఉన్నా, అతని జీవితం వంటిది ముమ్మాటికీ నాకక్కరలేదు నాకే కాదు, చాలామందికి అలాగే ఉంటుందను కొంటాను

అడవిలో పట్టిన తేనెపట్టు ఎవరికీ లభ్యంకాకుండా పోతున్నదే అనుకొంటే ఎంత ఫలితమో, అతని డబ్బు ఎవరికీ కాకుండా పోతున్నదే అను కొన్నా అంతే ఫలితం అయితే తేనె పట్టులోని తేనెను సమకూర్చడానికి తేనెటీగలన్నీ కలిసి పడ్డ కంటే ఎక్కువే కష్టపడ్డాడుగాని తక్కువ పడలేదు దానిని సంపాదించడానికి అటువంటి శంకర శాస్త్రుల్లును చూసి ఈర్ష్యపడడం దేనికి? ఇంతకీ అతని ఆస్తంతా మహాఉంటే ఒకటిన్నర లక్షలు ఆ మాత్రం మొత్తాన్ని అవలీలగా ఏమీ లక్ష్యంలే కుండా ఖర్చుపెట్టే శ్రీమంతులున్న మన వ్యాపారిక జగత్తులో అతన్ని గురించి అంతగా అనుకోడం ధర్మంకాదు కాని, భూగర్భంలో నిక్షిప్తమయి ఉన్న అమూల్యమయిన ఖనిజాల గురించి కలగని ఆలోచన తేనెపట్టును చూసి సరిగ్గా కలుగుతుంది ఎలా దీన్ని సంపాదించడమా? దీనిలో ఏ మాత్రం తేనె ఉంటుందా? అని

లోకులు, నాతోపాటు ఎవరేమనుకొన్నా సరే శంకరశాస్త్రుల్లుగారు మాత్రం సంకల్ప సిద్ధుడు. ఆ తృప్తే లేకపోతే ఆయన ఇన్నాళ్ళు బ్రతకనే లేక పోయేవాడు

---

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

[భాసమహాకవి సంస్కృతములో నిరువదిమూడు నాటకములు వ్రాసినాడని యందు "కిరణావళి" "మకుటతాడితకము" "ఉదాత్తరాఘవము" మున్నగునవి కలవని శ్రీ ఆర్. వి. కృష్ణమాచారిగారు వ్రాసిరి. ఇటీవలనే రాజవైద్య జీవరామకాళిదాసశాస్త్రి గారు "యజ్ఞఫల"మను ఈనాటకమును సంపాదించి ప్రకటించి యది భాసమహాకవికృతమే యని నిరూపించియున్నారు. ఈ యభిప్రాయమును విమర్శ కాగ్రేసరులగు డాక్టరు. పుసలేకర్, ప్రొఫెసరు సిన్హా మున్నగువారు విపుల విమర్శతో దీనిని బలపఱిచియున్నారు. ఈ విషయములెల్ల ప్రత్యేకవ్యాసమున నిరూపితమగును. ఇంతవఱకీ నాటకమే భాషలోనికి ననువదింపబడలేదు ఈ తెలుఁగుసేఁతయే ప్రప్రథమ భాషాంతరీకరణము ]

### ఇందలి పాత్రలు

సూత్రధారుఁడు
సుమంత్రుఁడు
కాంచుకీయుఁడు
విదూషకుఁడు
చిత్రకేతుఁడు, చిత్రపథుఁడు } గంధర్వులు
రావణుఁడు
మాళవకుఁడు, భషకుడు, దంతిలుఁడు, గోపలుఁడు } వైతాళికులు
దేవతలు
గంధర్వులు
రాక్షసులు

దశరథుఁడు [రాజు]
విశ్వామిత్రుఁడు
వసిష్ఠుఁడు
రాముఁడు, భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు } కుమారులు
జనకుఁడు
పరశురాముఁడు

నటి
విజయ
చేటి
మంథర
కౌసల్య, సుమిత్ర, కైకేయి } రాణులు
మధురిక, చతురిక, పుష్పతిక, చంద్రకళ } సీత చెలికత్తెలు
సీత, మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తి } వధువులు

(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించును)

సూత్ర

"శ్రీరాముండు కృపాళుతా భరిత
సుశ్రీమండలా కారుఁడుం
దాశ్రిత కుశలత్వగుణ ప్రథితుడున్
శత్రుఘ్న వినుండు వి
స్తార ప్రాభవ మాని చంద్ర కృత
యజ్ఞ త్రాత, కోదండ శా
స్త్రా రూఢుండు ప్రసన్నమూర్తి
నిరతోత్సాహుండు మిమ్మేలుతన్."

(తెరవంక జూచి) ఆర్యా! ఒకసారి యిటు రమ్ము

నటి (ప్రవేశించి) ఆర్యపుత్రా! వచ్చితిని ఏమి పని?

సూత్ర ఆర్యా! ఈ సభాసదులు మనము ప్రదర్శించు నాటకము చూడ గోరుచున్నారు వీరి సంతోషము కొఱకై వసంతఋతువునుగూర్చి నీ వొక పాట పాడుము.

నటి సరే (పాడును)

పాట

"క్రొంజివుళ్ళ చేత మిగుల గోములంబు లౌ లతల్
మంజులంబు లైన తియ్య మామిడిగా సుగంధముల్
రంజకంబు లిట్టి తోటర క్తి చెందుచుండగన్
సంజవేళ మల్లెపూలు సరసమౌడు నవ్వులన్ "

సూత్ర : బాగు బాగు నీ పాటవలన నందఱు సంతోషించుచున్నారు

(తెరలో) "ఏమి ! అందఱు సంతోషించు చున్నారు గదా!"

సూత్ర (విని) ఓహో !

"పుత్రజన నోత్సవంబున భూవిభుండు
తనర, మత్స్యవదాన సత్కారములను
వారు లెల్లర సంతోషపఱిచి యిదటి
కిదె సుమంత్రుడు విచ్చెసె, పద లతాంగి!"

(నిష్క్రమింతురు)

ఇది స్థాపన

## ప్రథమాంకము

(ప్రవేశము : సుమంత్రుడు)

సుమం ఏమీ ! అందఱు సంతోషించు చున్నారుగదా !

"పౌరులు తుష్టులైరి మఱి
బ్రాహ్మణు లెల్ల రభీప్సితార్థని
స్తార సుఖాబ్ధి దేలిరి, ముదంబున
శ్రోత్రియపుంగవుల్ సదా
చారులు సత్తమ శ్రీకులు సంయము
లందరి తృప్తి సర్వస
త్కారపరంపరన్ , దలప
గామ్యము తీరనివార లే రికన్

కంచుకి (ప్రవేశించి) అమాత్యా ! పురజనులను జానపదులను సంయములను సర్వజనములను సర్వవాంఛాపరితృప్తుల నొనరింపు మని నీకు మహారాజాజ్ఞయైనది ఏయొక్కడైనను చెట్టికోరిక కోరినను దీరనివా డుండరాదని మఱి మఱి నొక్కి చెప్పిరి

సుమం మహారాజామనకు తెలిసి నే నే సర్వము నొనరించితిని.

కంచు మంచిది సుమంత్రా ! మంచిది

"జనపతియాంతరహృదయం
బు చెజెంగి యమాత్యపుంగవుండు శుభంబుల్
పొనరింప ధర్మసంగతి
గను నపవర్గంబు బరమకల్యాణంబున్ "

మఱియు, చెఱ్ఱవెఱ్ఱ రెదలెదట చేయుకార ణముంచే బద్ధులైయున్నను వారివారి నెల్లర విడిపింపు మని రాజాజ్ఞ

సుమం . బద్ధు లెవ రున్నారు ?

"దొంగలు లేరు రాజ్యమున
దుష్టులు లేదము లమ్మువారల
న్యాంగన గోరువారు మను
వానెనువారును ద్యూతకారు లె
న్నం గనరారు మందున కనంగ ,
వితృణముబద్ధుడో నృపుం
డంగనలం సుధూరకుల నంది
గడించెను దద్వ్యముక్తతన్ "

విదూ (ప్రవేశించి) మహోర్వాలా గారి పుత్ర కామేష్టిఫల మిప్పటికే సఫలమైనది ఇన్నాళ్లు నేను మోదకములు మెతుక్కటలో నాజఠరమునై చేయు శ్రమ దయమాప లేదు ఇటువంటి యజ్ఞములు వాలు గైనవా నే న ప్రతిరథునే నను మోదకనైరి వనుమను నావంటివిప్రులు భోజనముచేసి తుష్టులగుదో నే యాజ్ఞకర్మ సఫలము కాదు

సుమం ఓయీ ! సుందరకా ! నీకు సువర్ణము చాలినంత లభించినదా ?

విదూ ఏమి ? నేను సువర్ణమును దినను త్రాగను ముట్టను బంగారము ప్రియమనుటకు నేను రాజు ననుకుంటివా కోమటి ననుకొంటివా?

కంచు ఓ మహాబ్రాహ్మణా ! మఱి నీకేది ప్రియము ?

విదూ మోదక భోజనము

కంచు నీ వెన్ని మోదకములు తినగలవు ?

విదూ మహారథుడగు మహారా జెంతమంది శత్రువులను జంపగలడో యన్ని

కంచు పదివేలమంది శత్రువులను జయింపగలవాడే మహారథుడు

విదూ నేను పదివేల మోదకములను దినగల మహారథుడను

కంచు ఏమి ? ఒక్కదినమున నీవు పదివేల మోదకములు తినగలవా ?

విదూ ఏమి ! ఒక్కదినములో మహారథుడు పదివేలమంది శత్రువులను జంపగలడా ?

కంచు పదివేలమందిలో గొంతమంది చనిపోదురు కొంతమంది పాఱిపోదురు. కొంతమంది చెల్లాచెదరగుదురు. కొంతమంది శరణుచొత్తురు. వీరిని మహారథుడు రక్షించును

విదూ నేనును గొన్ని మోదకములను భ్రమింతును కొన్నిటిని చెదరగొట్టుదును కొన్నిటిని జేతుక గొట్టుదును. కొన్నిటిని దయతో రక్షింతును

సుమం బాత్రధన్యా ! సైతండితుడు హేతువాదమున నొప్పుకొనడు ఏనితో నేమి ? నేను నా పని చేసికొని మహారాజా నభినందింప నేగుదును (ముందు చూచి) ఓహో ! సపరిజనుడై మహారాజిటకే వచ్చుచున్నాడు.

కించు' నేను నావనిమై పోవుదును. (నిష్క్ర
మించును )

విదూ నేను తినగా మిగిలిన మోదకములను
దాచుకొనుటకై పోదును (నిష్క్రమించును )

సుమం ఆహా! మహారాజా వార్ధకదశయందైన నెంత రమణీయాకృతితో నొప్పుచున్నాడు! నిత్యము రాజకార్యముల నిర్వహించుచున్నను నాతడు నిత్య ప్రసన్నుడుగనే యుండును

"సతనకతంబు లొక్కరుమై జల్పను,
 జాచుకొనన్ స్వకార్యముల్
విపిగను లొక్కతంక, నరి
 వీరుల నుక్కడగించు నొక్కటన్
మిత్రులగ దన్పునొక్కటను మిత్రుల,
 నొక్కడ చేటకేగు, ని
ట్లవిరళ కార్యభారమున నందడు
 దుఃఖ మొకింతయేనియున్
తరుణ వయస్కు వట్లు సతతంబు
 నొనర్చును స్వీయధర్మముల్
పరిణతి నందినన్ వయసు పాయదు
 తేజము రాజచంద్రునిన్
వరవరచంద్రు పేరు వినినన్ గనినన్
 జనకుల్ రతంతయేన్
గురితముతంక బోరు, విపత్కర
 కలాపము లొక్క త్రేళ్ళిడిన్ "

(సపరివారముగా రాజా ప్రవేశించును)

రాజా

"రిపుభయ మింతయేనియు
 గరిత్రిని లేదు, సమస్త మానవుల్
విపుల వయార్థ సంపదల
 విశ్రుతి గాంచిరి, అన్యవస్తుదు
ర్విపలత గాంచువారును
 రుజాధరతన్ విలపించు వారలున్
గపటము జూపువారును
 వకాలమృతిన్ గనువారు లేరిటన్ "

"కాలవర్షంబు గురియు మేఘంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగును అలఘుపుణ్య
కలిత దైవాన కాల్యంబు కలుగబట్టి "

"వేద మధీతమయ్యె, పితృవీరులు
 త్రుగ్గిరి, భూప్రజల్ సుఖా
పాదితులైరి స్వీయపరిపాలన
 మందున బోలె, నెవ్వ రె
ద్యోది మనంబులన్ దలచి రెల్లర
 కయ్యది చేకురెన్, మహిం
గేది యొనర్పగా వలయు నిప్పుడు
 నేను మహీజనార్థమై "

"దేవతలున్ పితరులు భూ
దేవతలున్ శరణుగోరు దీనులు నార్తుల్
వివిధముల బూజితు లగు
చే విధి వంశ్రతంబు నిద్దరు నాతన్ "

"పుత్ర జననంబుచేత సంప్రాప్తమయ్యె
మన్మనోరథ మహిత సమున్నత్య ఫలము,
ఇంతకంటెను మన్మనోభీప్సితంబు
లేదు లేకొంకు; సంతుష్టి లేదు నెటో "

సుమం (సమీపించి) మహారాజా! జయము

"ప్రజల పాలింప యోగ్యు లాత్మజాల గాంచి
యాత్మభారంబు వారిపై నమ్ము వలుప
హృదయభారంబు తొలగిపోయెనుగదా! నృ
పాలచంద్రమ! సంతృప్తి పైకొనె గద!"

రాజు సుమంత్రా! నిజమే నీవు వెంటనే సర్వార్థి జనమును సఫలాశాచిత్తుల గావింపుము

సుమం మహారాజా! కావించితిని

రాజు శ్రోత్రియులను గోహిరణ్య దానములచే సంతోష పెట్టుము

సుమం మహారాజా! సంతోష పెట్టితిని

రాజు కారాగృహబద్ధు లగువారి నెల్లర విడిపింపుము

సుమం మహారాజా!

"ధర్మపరిపాలనంబున ధరణిజనుల
రాజవై నీవు పాలించి రాజిలంగ
స్వర్గసౌఖ్యము లంది యొప్పార జనులు
బద్ధు లెవ్వగు? దుఃఖసంబద్ధు లెవరు?"

రాజా

"పూర్వపుణ్యంబువలన రాజ్యభూమి పరమ
విస్తృతంబయ్యె, నింతటి విపులభూమి
ధర్మహీనుండు బంధనదండనమున
కర్హుడైనట్టి వా డొకండైన లేడ?"

సుమం

"రాజసింహుడవై నీవు రాజ్య మేల
దుష్కృతం బొనరింపగా దొడగు నెవడు?
సూర్యుడు నిరభ్ర గగనాన శోభిలంగ
దారి కడ్డమువచ్చునే తమము తలప "

"ఇంతకు బద్ధులైన నరు లెవ్వరు
 లే రిక నుండ బోరు భూ
కాంతుడ! బద్ధమోహుణను కల్గు
 ప్రశంసయె లేదు చూడ నా
వంతయు, ద్వత్పితృఋణపరిబద్ధుడ
 నొక్కడ నీవ, కాని నీ
వంతము చేసికొంటి వద యార్య!
 సుపుత్రమహోదయంబునన్."

రాజా ఔను నిజమే పితరులఋణము తీర్చు గంటిని కాని, మతియొక దృఢతరబంధమే నాకు

కలిగినది దానిని గడద్రోచి ముక్తిగను మార్గము మాత్రము కానరాకున్నది.

సుమం ఏమది?

రాజు ఏమందువా? నా శక్తిమీద నెంత బాధ్యత పడినదో!

"చదివింపగా వలె వేదశాస్త్రములు,
వంశప్రాప్త వాచారముల్
మొదలన్ నేర్పవలెన్; వసిష్ఠ
పరమాహాత్మ్యంబు నా ధర్మసం
పద చేకూర్పవలెన్,—రణస్థలిని
దివ్యాస్త్రాన్వితున్ గాంచి యా
పద నైపుణ్యము ధృతిచెందురిపు
కేతన్—నేను ధృతిల్లెదన్"

"రాగద్వేష విదర్శితాత్ములై
మహారాజ్యంబు లేలన్ ప్రజా
క్షేమము జూచి ప్రోవ గనగా
మోక్షమ్మేల్ కదా! కాని నే
నీగుణాలను ధర్మబంధనము,
నే దీప్తి రాగంబు తో
నాగ్రహించె ద్విబద్ధతన్, గలదె
ముక్తత్వంబు నాకెవిధిన్?"

"దృఢతరంబుగ బంధింపబడితి బుత్త్రి
రాగపాశంబునన్ త్రెంపగాదు దీని,
మోక్ష మెటులక్లు బుత్త్రి పమోహపాశ
బద్ధునకు? నిట్లు నాస్థితి ధయదమగును"

ప్రతీహారి (ప్రవేశించి) మహారాజా! జయము పుత్రోత్సవమైన పిదప కౌసల్యాదేవి మహారాజును జూడ వేడుకపడుచున్నది తాను పెద్దభార్య గాన తొలుత నే తన్ను సంభావింప మహారాజును గోరుకొన్నది

రాజు విజయా!

"ఉత్తమవంశప్రథితయు
నుత్తమ పత్నియును నా మదుపలాలిత యు
త్కృష్టమ సుందరి దేవిని
నుత్తమిని నపేక్షయు విడ రమ్మందున్"

చేటి (ప్రవేశించి) మహారాజా! జయము సుమిత్రాదేవి మహారాజ కృపచే గుశలమునియు దా విద్దఱుకుమారుల గన్నతల్లియగుటచే ముందుగా సంభావింప గోరుకొన్నదనియు చెప్పుచున్నది.

"సర్వంసహా తపములోన వి
గర్వితి సుమిత్రతజా సకలసంగతులన్
సర్వతకేంవద యాపెయు
గర్వ ము పేక్షింప తన్నుద్యాగం బింకన్."
(అంత మంథర, విదూషకుడు ప్రవేశింతురు)

4

మంథ మహారాజా! అఖిల జానపదాహ్లాదరయు, రాణులలో గనిష్ఠయయ్యు గుణములలో జ్యేష్ఠయు, తన్వియయ్యు సగౌరవయు, మహారాజ బహుమతయు, అప్రతిరథుడను కేకయరాజు కూతురు నగుదేవి తానే ముందు సంభావింపదగిన దని నివేదింపు మన్నది

విదూ (తనలో) అహో! ఈరంత వచనో పన్యాసము! ఎంత తర్కన సహితము!(ప్రకాశముగా) వయస్య! ఉపేక్షించినచో గనిష్ఠ యగుదేవి యేమి చేయునో వినదలచితి నని ప్రతివచన మిమ్ము

రాజు (తనలో)

"తనసుతునకు నభిషేకము
గొనగ బ్రతినగొన్న యీమె కోపించినచో
గనవసు చింపించవలె నీ
మెను రాణులతోడగూడ మెప్పింపవలెన్
(ప్రకాశముగా) మంథరా!
"పరమధర్మార్థకామ పదార్థలనమున
సేవనీయలపై భేదభావ మున్నె
ముప్పురనుగూడ సమముగా ముదముతోడ
నాదరింతు సపుత్రుల నచిరమునను"

అందుచే నందఱును మధ్యమమందిరమున నా రాక నిరీక్షింపుమంటి నని చెప్పుము

మంథ (తనలో) ఏమి! మా రాణిని ముందు గౌరవింపడా? (ప్రకాశముగా) మహారాజా సెలవు ప్రకారమే

(ప్రతీహారి, చేటి, మంథర నిష్క్రమింతురు)

రాజు అమాత్యా! నీవును వెళ్ళిరమ్ము నేను రాణుల నభినందింతును

సుమం చిత్తము (నిష్క్రమించును)

విదూ వయస్యా! నీవు ముగ్గురు దేవులను సమానముగా మన్నింపరాదు సుమిత్ర కిద్దఱు కొడుకులు—కైకేయి కొక్కకొడుకు. కావున, సుమిత్రనై జూచిన మున్నవలో సగమే కైకేయినై జూపవలయును.

రాజు వయస్యా!

"సకల ధర్మార్థకామమోక్షములలోన
భేద మెటులేదో పుత్రులకు లేదు నాకు,
ఒక్క వేదంబునైనను దిక్కువన్న
యతిని విప్రుండె? వైదికుం డనుకొనునె యతండు?"

విదూ (తనలో) ముగ్గురు రాణులు త్రివర్గ తుల్యలు నలుగురు కొడుకులు చతుర్వర్గతుల్యులు. విదురుడు సమానుడైనచో నేమనవలయునో! (ప్రకాశముగా) నేను నీకు గనిష్ఠతయుణ్యమైయు నీ పుత్రులతోపాటు సమానముగా భోజనీయుడను కానిచో నీతో స్నేహము చేయను. అట్టిదు పురుషార్థములు నాలుగు. నేనును నైదవది కదా!

రాజు (నవ్వి)

పంచమహాయజ్ఞంబుల
నెంచన్ విప్రుండు నగుచు నీ వింటిలో
మించెదరు మీరు నట్లే
కించపడగనేల నీకింక వయస్యా!

విదూ: ఆఱుగురు లేరు ఉన్న నీ మాటకారి తనము తెలిసిపోయినదిలే (ప్రకాశముగా) వాడు కలుఁ పుట్టినదినమన్న యుత్సాహముతో నీ వాకిలి పైతము మఱచితివి సూర్యుఁ డస్తమించుచున్నాఁడు చూడుము

రాజు ఓహో! సంధ్యాకాలము సమీపించినది.

శిరమునొసంగు వృక్షముల జ
య్యన బక్షులు చేరి కూఁ సెదుఱ
గిరణములన్ నభస్థలిని నిం
పెను నర్ధకళాంకు డిప్పుడే,
చరమ నగంబునన్ దినవిభాంపతి
గ్రక్కును గాంతిపుంజముల్,
పరగు ప్రకాశమున్ రజని
ధవళ ముఖామల భూషణం బనన్
మఱియు
హిమకరు డేగుదెంచి గగనేం
దిరకున్ గనుపండు వట్లుగా
విమల సరోలసత్కుముద విశ్రుత
విశ్రుత పరీవృతుండు ను
త్తమ బహురాజ సంయుత యథార్థ
సుశోభియు రాజ ను
త్తము డగురాజు నా బరగు ద త్త
దనూన విధాన కర్మలన్

(నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము

## విష్కంభము

(ప్రవేశము కాంచుకీయుడు)

కాంచు మహారాజు నా కిట్లాజ్ఞాపించెను "ఓ భాద్రభద్రా! ధారాగృహమునకడ నున్న గ్రీష్మోద్యానమున కేగి యచట బరిజను లెవ్వరు నుండరాదని యాజ్ఞాపింపుము" మహారాజటకు విహారమునకు వచ్చును. రాణులు నుందురు పరిజను లుండరాదని యేల యనెనో? ఏదైన రహస్యాలోచనము గలదా? రాణులతో గూడి రహస్యవిహారము మహా నెప్పుడును జేసియుండలేదే! నా కేగొడవ యేల? నన్నేమి చేయుమన్న నదియే చేయుదును.

"రాజుల చేష్టలన్నియు గరంబు
దలంప నిగూఢ భావని
శ్రాంతములు, సుమంత్రులకు గ్రాహ్యము
లన్యుల కట్లుగా నవే

మోజను శంక చేసినను మెవ్విధి
కల్లడిచేయ దోసమా;
పూజితబుద్ధి కన్నులను మూసికొనక
దలపోయ గృత్యమా"

(అంత, చేటికలు ప్రవేశింతురు)

ఒక చేటిక ఆర్యా! నలుగురు కుమారులకు నాలుగు కుసుమ జవనికలను మేము నూత్న మక్కువతో తయారు చేయుచున్నాము

కాంచు మంచిదే కాని, మఱియొక యుద్యానమున కేగి మీ కోరిక తీర్చుకొనుడు

మఱియొక చేటిక ఆర్యా! ఇంకొక యుద్యానమున నిన్ని రంగులు నింత పరిమళము కలిగిన పువ్వు లధికముగా లభింపవు

కాంచు ఐన నే నేమి చేయగలను? ఇపు డెవరు నిట నుండరాదని మహారాజాజ్ఞ

చేటికలు ఓహో! ఐనచో పోవుదము

(నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

## ద్వి తీ యాం క ము

(మహారాజు పరిజనులతో ప్రవేశించును)

రాజు (స్వేచ్ఛగా నడచి)

"చేసితి జన్నముల్ ఋషివిశిష్ట
విధిన్ బహుళప్రకారముల్,
దోసిళులన్ బ్రదానముల దుష్టిగ
నిచ్చితి గోచితిన్ బ్రజన్,
పీసముకూడ శత్రుభయవిహ్వలతల్
గనరావు, నే నిరా
యాసముగా జరాధరత
సాంతమునందున శాంతి నందదన్"

మఱియు

"కంటిని నాత్మసౌఖ్యమునకంటె
బ్రజాసుఖ ముత్తమంబుగన్,
మంటి గులానురూప ముగు
మావ్యయశోధనవృత్తిచేత, నే
మంటి స్వకర్మ పీడక మ
హోన్నతభోగములెల్ల నంది, నే
కొంటి జనానురాగ మిక
గోరిక నేది యునర్తు నర్మిలిన్"

(ఆలోచించి)

"రాణులను మువ్వురను గూడ రంజిలంగ
జేసి రాజసుతాన్వితశ్రీ చెలంగు
రామచంద్రుని రఘువంశరత్న సదృశు
యౌవరాజ్యాభిషిక్తు జేయం దలంతు"

ఎవ రక్కడ ?

ప్రతీహారి. (ప్రవేశించి) మహారాజా! జయము ఏమాజ్ఞ ?

రాజు. విజయా! అమాత్య మను సుమంత్రుని పిలుపుము

ప్రతీహారి. చిత్తము (నిష్క్రమించి సుమంత్రునితో మరల ప్రవేశించును)

ఆర్యా! ఇటు ఇటు ఇదిగో మహారాజ సమీపింపుడు.

సుమం (చేరి) మహారాజా! జయము

రాజు అమాత్యా! స్వాగతము రమ్ము కూర్చుండుము

ఇరువురు (కూర్చుందురు)

రాజు విజయా! నీవు పొమ్ము (పరిజనులను జూచి) మీరును బోయి విశ్రాంతి నందుడు

పరిజనులు చిత్తము (నిష్క్రమింతురు)

రాజు అమాత్యా! నామనస్సు చింతాజాగరణపరవశమై యున్నది

సుమం (తనలో)

"భూరియశంబునుగన్న మ
హారాజత డౌను, రిపుభయప్రద మయ్యున్
బోరప్రియుఁడై చింతా
భారజ్వరుఁడౌట కేమి వచ్చెనొ కట్టా!

(ప్రకాశముగా) మహారాజా!

స్థిరధర్మప్రతిమున్ ప్రజా
ప్రియ మహాదృష్టమ్ము గళ్ళత్రు తా
సురతిన్ గాంచిన నీకు
నెక్కడి భయా ఘోరవ్యథల్ దేవ! న
ల్వురు పుత్రుల్ వినయాన్వితుల్
ప్రజల కత్యంత క్షేమ పాత్రంబులై
పరగన్ మానసిక వ్యథాభరము
దేవా! యెట్లు కల్గెంకటా!

మఱియు

"కృతసంస్కారులు వినయా
న్వితులున్ జనరంజకులును విత్పృథుత్త్వులునౌ
సుతులన్ నల్వుర గనుగొని
పిత తల్లన్ బాయగనగ దేవేగ ప్రభూ!

లేక

"అవిభక్తకుటుంబిక గా
వ్లవిరళదుఃఖంబు గలుగ నటులే నీకున్
సువిశాలరాజ్య మనియెడు
నవిభక్త కుటుంబమందు నది కల్గెనొకో ?"

పోనిమ్ము మహారాజా! చింతాప్రతీకార మూహింపరాదా!

రాజు అందులకే నిన్ను పిలిచితిని

సుమం సెలవిమ్ము

రాజు

"శ్రీకైకేయీ తనయుండే
యేకైకప్రభుత్వ గాగ నీమహి నెల్లన్
చేకొను వరమిచ్చితి నది
వేకంబున దొల్లి దాన వతకందు గటా!"

సుమం విన ?

రాజు

"రాజ్యపాలన యోగ్యుండు రాముడే యగు
చు త్రిసుగుణాకరుం డైన కారణమున
యౌవరాజ్యాభిషేకంబు నతని కేను
చేయదలచితి సుకరంబె ? చేయుదికట!"

సుమం మహారాజా! అది దుష్కరము కాదు

రాజు ఎట్లు ?

సుమం

"వినయ నయ ప్రవర్తన వివేక
గుణాదికపూర్ణు డైన రా
ముని ముగురమ్మలున్ దమదు
ముద్దులబిడ్డని గాగ ప్రేమ పెం
పున గనుగొంద్రు, జ్యేష్ఠుడగు
భూరిగుణంబుల దేజమందు, నా
తఁ డభిషేకమన్న ముదంబును
గాంతురు రాణు లెల్లయున్"

అందుచే నీవు చింతింపవలసిన పని లేదు. ఇంతకు కుమారు లుపనీతులైరి శస్త్రశాస్త్రనిష్ణాతు పూర్ణులైన పిదపగదా యభిషేకము ఇప్పటినుండియే నీ కీ చింత యేల?

రాజు పుత్ర రాజ్యాభిషేక వివాదమే తుదు నిప్పటినుండి యాలోచించిన నప్పటి కే యుపాయము చేనైన దానిని దొలగించుకొనవచ్చునుగదా! వినుము ఒక్కొక్కప్పుడు:

"పరగ ప్రాప్తించిరం గానుపాయమునను
భావికష్టంబు తొలచుకొవచ్చును గద!
వచ్చి పైబడ్డ కష్టమ్ము బాపుకొనగ
ప్రోవ నదుకుట యగు ద్వ్యథా దుఃఖకరము"

సుమం: నా కేమి యాజ్ఞ ?

రాజు

"పరిజన భృత్యమంత్రిజన పౌరజనంబులు
రాణులన్ నిరం
తరమును రామునామము లపారత
రామనిధేయ చిత్తులౌ
కరణి వొనర్పు, మా భరతు
గాథత రాగజత త్రియుత్తసం
భరితు నొనర్పు, మియ్యది సుమంత్ర!
తొలంచు మదాత్మ కలతమున్

సుమం (తనలో) ఆహా! మహారాజా దూర

దృష్టి! (ప్రకాశముగా) మహారాజా! అట్లే యొన రించెదను. నీకు సర్వము సుముఖముగను కావున నీ కావంతయు విచారింప బనిలేదు! (ముందు చూచి) మహారాజా! ముగ్గురు రాణులును బరిజనసహితముగా నిటకు వచ్చియున్నారు.

రాజా మంచిది. నీవు వల్లిరమ్మని నే నన్న దేయాత్రమేమంటివు

సుమం : చిత్తము (నిష్క్రమించును)

రాజా రాణులు ముగ్గురు సపరివారముగా వచ్చియున్నారు. నే నీగ్రీష్మోద్యానమున గూర్చుండి వారి వందనము రక్షించెదను (నిరూపించి) ముందు

కౌసల్య

"మా వినము త్రియంబు, మునుముందట
వచ్చిన లక్ష్మి, దివ్యకో
భాసము పేరి కోటిసు మధిప్య లతా
లలితాంగి, నా యొపందలో (?)
భావిలు మాననీయ పతిభక్త
తినాథరమున్ గడున్ క్రమా
భ్యాసమునన్ దరించునది యామె
ను పేతు యొనర్ప ధర్మమే?"

తరువాత సుమిత్ర

"వ్రత నియమాళి పరమవంద్య
కృశాంగి, ముఖాంబుజ ప్రభా
వితత శుభాంగి, యుత్తమ వివేక
వతీమణి, నోట గట్టిగా
నతివ యొకింగియున్ బలుక,
దర్పవిమీలిత నేత్రి, శాంతదే
వత, బహు సౌఖ్యదాయక, శుభప్రద
యామె నతింప జెల్లదే?"

ఇక కైకేయి ఆమె

"కమల వనంబు మధ్యమున
గన్పడు భానుబింబ మట్లు నె
య్యమున మెలంగుచున్ నను
సముంచిత భంగిని జూచు బార్యమా
యమ, కడ నున్న లక్ష్మియున
నాదృతి జూపదు తా సపత్నులన్,
సమదమ్ము గంధ్ర మత్తులనికిం
బోక చిరికిగోదు లోకమున్"

చివరిలో

"తొలిమహిషి రామజననియు
విలసచ్ఛుభ లక్షణాంగి విశ్రుతనయ సం
కలిత సగర్వయు నను కో
సలరాజాత్మజయె నిత్యసమ్మాన్య యగున్"

కాని

"దురభిమాన రోషములు ముందునకు గొనదు
సర్వమిత్ర సుమిత్ర యాసత్యముగను
అత్మకామానుసారిణి యహారణంబు
నా యెడంద జయించిన నాతి యామె"

కైకేయి

"ఏ కార్యంబు నెటుంగని
యీ కాంతకు ముక్కు నందె యొసగును గోపం
బే కాని విక్రమాన్విత
నా కష్టము బాపి యసురు నాకున్ గాచెన్."

వినను

"ఈమె రోషము పరిగణియింపరాని
దగును కార్యప్రణయశీల యగుటచేత,
తలప ఛందోనుబద్ధవృత్తంబురీతి
శీఘ్రముగ నే ప్రసాదసంసిద్ధి గూర్చు"

(అంత ముగ్గురు రాణులు పరిజనులతో ప్రవేశింతురు)

అందఱు మహారాజా! జయము

రాజా రాణులకు స్వాగతము రండు ఈ మణిఖచిత శిలాతలమున గూర్చుండను

అందఱు (కూర్చుందురు)

రాజా పరిజనులారా! మీరు పోయి విశ్రమింపుడు

పరి (నవ్వి) చిత్తగు మహారాజా! (నిష్క్రమింతురు)

రాజా అహా! గ్రీష్మకాల మధ్యాహ్నసమయమునకైన నీశీతలోద్యాన మెటు లున్నదో చూడుడు

"భువనమ్ముగంబులెల్ల దరుపంక్తుల నీడల
గూర్చుక నిట్టకున్,
ప్రవిమలవాపికాజలచరంబులు హంసలు
కృత్రిమంబులా
పవిదివి దాచు, గోటు లిట
పాదపశాఖల జంక్రమించు, దా
వపుల గలట్టిపక్షు లిట
దారసిలున్ సుఖశైత్య మందగన్"

కాప ఈ యుద్యానవనము చూచినవారి కెల్లరికి సుఖావహమే కాని, నా కిదివఱ కిచ్చు సుఖ మిద్పుట లేదు

రాజా ఏదైనను గాలము ననుసరించియే సుఖముకాని దుఃఖముకాని కలుగును

"చన్నిటన్ స్నానము సం
పన్నము సేపవిని, కాని మఱి సీతువ నా
పన్నము కావున గాలమె
యొన్నగ సుఖదుఃఖవితతి నిచ్చు నరులకున్"

కైకే ఆర్యపుత్రా! ఈ కాలమున మే మేమి చేయవలయు నని నీకోరిక?

కైక· (తనలో) ఈమె మాటలు శిలాక్షరముల వలె నుండును

రాజా ఈ యుద్యానరమణీయతం దిలకింప

చేయుటకే నేను మిమ్ములను పిలుపనంపితిని. ఈచెట్టు నీడను చల్లగా కూర్చుండి సరసముగా మాటాడు కొందము

రాణులు. సంతోషము

రాజా బిడ్డల కుపనయనములు చేసితిని. పదునైదు సంవత్సరములు వచ్చినవి

కైకే ఔను.

రాజా అందఱును గుణాశ్రయు లగుదురులే

కౌస (తనలో) రాముడే సర్వగుణాకరుడు, రాజ్యయోగ్యుడు

కైకే పితృకులము కూడ దక్కువది కాదు గాదా!

రాజా నిజమే కాని!

“స్వగుణముచే గ్రియున్
సితరుచంద్రము దీపితముం బొనర్చుట
త్యగణితగౌరవంబునను నారయ
బుత్రుని కట్టిదో నికన్
సుగుణము సుత్రయాన్వయము
శోభిలజేయునుగాదె చిక్కలిన్
విగుణుని కిద్ది భారము వివేకముతో
బరికించి చూచినన్ ”

ఇంతకు వీరిలో నిర్ణయము గలవు దేనికిని లోపము లేదు

అందుచే నందరియందును నాకు సమానప్రేమ గలదు

కౌస: (తనలో) నాకు మాత్రము రామునియందే యెక్కువ ప్రేమ

సుమి జన్మక్రమము ననుసరించియే నా ప్రేమ భేదము

కైకే నాకు గుణాధికునిపై నెక్కువ ప్రేమ

రాజా గుణాధికు డెవడు?

కౌస: (తనలో) రాముడే

కైకే అవసరమైనప్పుడు చెప్పెదను

రాజా అందఱు నా దాయభాగమున కర్హులే

సుమి దాయవస్తువులలో శ్రేష్ఠమేదో యది జ్యేష్ఠునికే రావలయు నని మనువు చెప్పినాడు

కౌస (సంతోషమున దనలో) మహారాజా దాయవస్తువులలో రాజ్యమే శ్రేష్ఠము

రాజా ఆచారవిషయమున మనువు ప్రమాణము రాజధర్మవిషయమున వాసిష్ఠము ప్రమాణితము

కైకే వాసిష్ఠ మేమనును?

కౌస (తనలో) రామునికే రాజ్య మిమ్మని

రాజా వాసిష్ఠమున నిట్లు గలదు

“ధనకనకాదికం బయిన దాయము
పుత్రులు పంచుకో దగున్;
గుణముల శ్రేష్ఠు డెవ్వ డగు నాతడు
పద్ధతికంబు సర్వదా,
యనుపమ సైన్యనాయకత యా
సురకార్యనతి, వయోగుణం
బున నది కాదు, రాజ్యమును బొందగ
నర్హుడు యోగ్యవర్తియే ”

కైకే యోగ్యత ప్రతి పురుషుని దృష్టిని భిన్నముగా నుండును ఒకని మనసునకు యోగ్యముగా దోచునదే మఱియొకని కయోగ్యముగా దోచును

రాజా (తనలో) ఏదో వ్యాజమున నా కోరికకు విరుద్ధభావమును కైకి జూపి కార్యసిద్ధి నందుదును (ప్రకాశముగా) కుమారులు నలుగురు యోగ్యులే రాజ్యమును నాలుగు భాగములు చేసి యొక్కొక్కని కొక్కొక్క భాగ మిచ్చెదను.

కౌస (తనలో) రాజ్యమంతయు రామునికే యీదగును

కైకే ఇదియు వాసిష్ఠమతమే యగునా యేమి? ఇట్టి యనాప్తవచనమునకు ప్రమాణ మేమి? ఏక రాజ్యమే కాని సామ్రాజ్యవిభాగము పనికిరాదు

రాజా మఱి రాజ్య మెవరి కీయదగును?

కౌస (తనలో) రామునికే

కైకే యోగ్యతమునకు

రాజా (తనలో) ఇపుడే సర్వము మాటాడుదును (ప్రకాశముగా కైకేయితో) మన వివాహకాలమున నేను నీకిచ్చిన వాగ్దానముమాట జ్ఞప్తి యున్నదా?

కైకే అంతయు జ్ఞప్తి యున్నది

రాజా కావున భరతుడే రాజ్యదాయార్హుడు

కైకే ఏ స్త్రీ పుత్రునకు రాజ్యలాభము కలిగిన సంతోషింపదు?

కౌస (తనలో) ఈ మాట వజ్రపాత సదృశము (మూర్ఛిల్లును)

సుమి మహారాజా! రక్షింపుము కౌసల్య మూర్ఛిల్లినది

(రాజా పైబట్టతో విసురును. కైకేయి భృంగారిణి నుండి జలము తెచ్చి ముఖముపై జల్లును సుమిత్ర కాలుసేతులు రాయుచుండును )

సుమి: దేవి తెలివొన్నది (కౌసల్యకు స్పృహ వచ్చును )

రాజా: దేవీ! ఏల మూర్ఛిల్లితివి?

కౌస మధ్యాహ్నవేళ యిటకు వచ్చితిని ఎండదెబ్బ తగిలినది.

రాజా: (తనలో) రాణి దుఃఖకారణము కాకలయు గూడ బోధపడినది

సుమిత్ర: మహారాజా! వివాహకాలమున జేసినప్రతిజ్ఞ ననుసరించి భరతుడు రాజగును. జ్యేష్ఠు

డగుటవలన రాముడు రాజగుట వారియపురణ చేరి పగను రాజ్యమీయ దగును

రాజు : నీకొడుకుల క్షేమమెట్లుండును?

సుమిత్ర : నాకు నా కొడుకులకు క్షేమమయ్యె నక్కఱలేదు

"శ్రీరామచంద్రు డాశ్రిత రక్షకుండయి
రాజ్యమేలుచునుండ రమణ మీఱ
సేవ లక్ష్మణునితో నిత్యంబు ప్రియమార
సేవజేయుచునుండు జిత్తశుద్ధి
భరతశత్రుఘ్నులు పరిపూర్ణసుఖములు
పొందుచుందురు సదానందు లగుచు
రాజ్యమన్నను పరరాజభయంబును
స్వజనపాలన మహాభార మెంచను,
నది యెన్నటికిని నిరంతర మకట! ఖేద
సమితి, నెడగొట్టు మానసశమము నదియు
నఖిలమును మించిమాన మహాసుఖంబు
పరమశాంతియె, యదియె సేవాఫలమ్ము"

రాజు : కైకే : ఆహా! సుమిత్రాదేవి త్యాగము శమము లోభ్యరాహిత్యము నతిసంభావనీయములు గదా!

కౌస (తనలో) ఇంతమాత్రమున నాకు సంతోషము లేదు (ప్రకాశముగా) నాసపత్నులెంత మహానుభావురాలు!

రాజు తల్లిగుణములు కొడుకులకు వచ్చునట ఇట్టియామె పుత్త్రులే భ్రాతృసేవావ్రతధారు లగు పుత్త్రులు. వారే ధన్యులు.

సుమి నాకు గావలసిన దిదే

"మానిని గాదు మాన నఖి
మానిని గాదు ప్రపంచరంగస
న్మానిని గాదు నిత్యమృగు
మంజులవాక్ప్రభురాజ్యకాదు కో
భావన గాదుధన్య యగు
నామె సపత్నులచేత భర్తచే
మానిత కీర్తనీయ యగు
మానిని దక్కగ భూతధాత్రిలో"

రాజు ఇంతకు రాజ్యయోగ్యు డెవడు?

కైకే : నామాట పాటించుచో రాముడే రాజ్యార్హుడు

కౌస : సంతోషము. సంతోషము

సుమి నామనసున నెట్లున్నదో కైకేయియట్లే పలికినది

రాజు : వివాహకాలమున నే జేసినప్రతిజ్ఞ గతి యేమి?

కైకే : వ్యర్థగతియే.

రాజు : ప్రతిజ్ఞాహాని పాతక మనియే సంప్రదాయము.

కైకే : భవాదృశులగు రాజర్షులకు ప్రతిజ్ఞాహాని యనర్థకము కాజాలదు

ఏలన

"ప్రతిన యుపేక్షితం బయిన
పద్ధతిలో నది తప్పు, లేక యా
ప్రతిన స్వసౌఖ్యలబ్ధికయి
పాడొనరించుట తప్పు, చూడ నీ
గతులను రెండిటిన్ ప్రతిన
గాంచని యట్టులు మాన ధర్మసం
గతి యగు నిది, దీని కథ
కారివి నీవె, తలంపు ధర్మమున్"

కౌస (తనలో) అయ్యో! పిడుగుపాటు సంభవింపదుగదా!

రాజు యుక్తమే

కైకే

"ప్రజల సౌఖ్యంబుకోసమే ప్రతిన నీవు
దాటజాలవుకాని స్వార్థమున గాదు,
ప్రతిన తప్పుటవలన లవంబుకూడ
పాప మంటదుగద! మహాభాగ! నీకు"

మఱియు

"గుణులలోపల రాముడే గుణివరుండు
పాలనార్హుండు కౌసల్యపగిది నతడ
భువనసంరక్షణార్థమై యవతరించె
విష్ణుపగిదిని విఖ్యాతకీర్తి పతికి"

ఒక కార్యము విచారించునపుడు కారణప్రాధాన్యము నపేక్షింపరాదు నన్ను సంతోషపెట్టుటకై నాకుమారునికి రాజ్యదాయ మిత్తునని నీవానాడు పలికితివి రామునికి రాజ్యదానము చేయుటవలన నేను ప్రసన్నురాలను భరతునికి రాజ్యమిచ్చిన నెంతయో రామునికిచ్చినను నాకంతియే

రాజు భరతుడును గుణవంతుడు, రాజ్యార్హుడుగదా!

కైకే ఔను కాని:

"అనుగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణుల గుణవత్తరుడు మేలు కోటిరెట్లు
భాస్వరము రాత్రి వెలుగు దీపంబుపగిది
కాని యది యెంత మధ్యాహ్నభానుముందు?"

కాదేల?

"భరతుడు గుణి యగు గుణవ
త్తరు డగు రాముండు కాన దగు నతడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుం డతి డతని కన్న పరముడు కలడే?"

కౌస సంతోషము. సంతోషము.

సుమి ఆహా! సపత్ని కైకేయి మహానుభావయు నీతిజ్ఞయు.

రాజా : మేఘములు గర్జించినచో కాని యమృత వృష్టి కురియదు

కైకే ఆర్యపుత్రా! ప్రణయ సమయమున నైన నిర్వ్యాజముగా నేను పల్కినది చెప్పెదను అదియే మేఘ గర్జనము అయిన క్షణమాత్ర మెన్నడును బలుకను. అదియే యమృతవృష్టి ఏలన

"అమృతవర్షము కురిసెను నట్టిమేఘ
మెపుడు వర్తించు సహజమౌ వృత్తితోడ,
దానిమార్గ నిరోధంబు తనరె కాని
అతివిగూఢను వర్షించు నది నిజమ్ము"

రాజా (తనలో) అధిక ప్రసంగమువలన మతి యొక భీతి కలుగుచున్నది ఈదేవి క్షణములో గోపించును క్షణములో శాంతించును కావున నిక నాకు శంక వలదు (ప్రకాశముగా)

"ప్రాప్త కాలంబునన్ రాజ్యపాలకు డగు
సుగుణవంతుడు నైన సుకుమారు, డపుడు
నియతి నాతం డొనర్చును నిశ్చయముగ
సర్వసౌఖ్యాన్వితుల గాగ సర్వజనుల"

కైకే ఆర్యపుత్రా! ఇపుడు మన మనుకొన్నట్లే జరుగలదు మన మట్లే తప్పక యొనరింతము

కాప మహారాజా! సాయంతన క్రీడల కేగిన కుమారులు నలువురు జ్యేష్ఠ వయ వారు నమస్కరింప వచ్చియుండుటచే వారిని సంభావింప నే నేగి వచ్చెదను

సుమి కుమారు లందఱు ముగ్గురు తల్లులకు సాయంకాలము వచ్చి నమస్కరింతురు వారికి జ్యేష్ఠ, కనిష్ఠ భేదము లేదు

కైకే ఔను నేను బోయివచ్చెదను

రాజా మంచిది

రాణులు (రాజునకు నమస్కరించి నిష్క్రమింతురు)

రాజా :

"మదిని గలంగు మానసము
మోదమునందెను తీరి వర్తనన్
బహుతర భంగ దొక్క రుచి,
వర్తిలు భిన్న రుచుల్ జనాళిలో,
వాదపును జ్యేష్ఠ కార్యముకు
మన్నతి రక్తి, కనిష్ఠ కీర్తియా,
మచులు విభిన్నముల్; కలుగు
మాటికి దుఃఖము నాకు నింటిలో"

"బహు భార్యాత్వము నరునకు
బహు సౌఖ్యకరము గాదు పరికింపంగా
బహు మానసరోగంబులు
బహురాగము కూడ నతని బట్టి సలార్పున్."

ఎవరక్కడ?

ప్రతీహారి (ప్రవేశించి) మహారాజా! జయము ఏమి సెలవు?

రాజా విజయా! సుమంత్రుని బిలువుము.

ప్రతీ (నిష్క్రమించి సుమంత్రునితో ప్రవేశించి) ఆర్యా! ఇటు ఇటు.

సుమం మహారాజా! జయము

రాజా అమాత్యా! స్వాగతము రమ్ము కూర్చుండుము విజయా! నీవు బయట కేగి కూర్చుండుము

ప్రతీ చిత్తము (నిష్క్రమించును)

సుమం : ఏమి సెలవు?

రాజా నే నిపుడు కైకేయి మహానుభావత సచిత్ర యాలోలుపత తెలిసికొంటిని

సుమం . ఎట్లు?

రాజా కైకేయి తనయునికే రాజ్య మిచ్చెదనని నా ప్రతిజ్ఞ యున్న నామె గుణవత్తరునకు రాజ్యమీయ దగునన్న న్యాయముచే రామునికే దానిని విడిచిపెట్టినది ఇక, సుమిత్ర తనయులతో రామ సేవానిగ్నత గోరుకొన్నది ఓరి మహానుభావత పరమాశ్చర్యభరితము కదా!

సుమం ఔను కాని,

"భావిన్ సౌఖ్యము గోరి మారిజనముల్
భావించి బాగోగులన్
సేవింపన్ పౌరంగేంద్రు న్యాయపథమున్
కెందర్మహా కష్టమున్,
దైవాయత్తము లోకమంతియు, క్షమన్
జంపుగ సదా దైవమే,
జీవుం డెట్టులొనర్చు దొంటి జనిలో
సిద్ధించు నట్లే జనిన్"

అందుచే

"పుత్రులు నల్వురున్ సుగుణపుంజము
లద్భుత మూర్తిశేఖరుల్
గాత్రము తన్న వేఱయిన గాని
మనస్సులు చూడ నొక్కటే
మాత్రము ప్రేమ భంగమును మాత్రము
కల్గగ నీదు రాజ్య మీ
పుత్రుల, కెంతవాడి యగు ముల్లును
నీకుల జిల్లుపుచ్చునే?"

కనుక, నీవు రాజ్యప్రదాన చింతను విడువుము. రాముకే రాజగును నీవు సంతోషముగా పంపెదవు జను లెల్లరు సంతోషింతురు. ఇక నీ కేమి కావలయును?

రాజా : నే నిపు డదే యాలోచించుచున్నాను

సుమం వసిష్ఠ భగవాను లిట్లు విన్నవించిరి.

రాజా గురుభగవాను లేమని సెలవిచ్చిరి?

సుమం . ఇట్లని, "కుమారులు .

"వేదములెల్ల నేర్చితి వి
 వేకమునన్ శుభవిద్య లెల్ల స
ద్వ్యాదరణంబునన్ వినితి
 యౌవనమంది కుశాగ్రబుద్ధిఁ బో
వేదిత శస్త్రశాస్త్రబహు
 విద్యల గాంచితి వీర రాజనీ
త్యాదుల శాసనాదిక వి
 ధాతల జేసి యనుగ్రహించెదన్"

విదూ: (వచ్చుచు ప్రవేశించి) ఓయీ! వయస్యా! ప్రతీహారులు నన్ను రా నీకపోగా వారితో పోరాడి నీకొక ప్రియవిశేషము చెప్పుటకై యిట వచ్చిపడితిని.

రాజు: ఏమి ప్రియము?

విదూ: రామునకు రాజ్యాభిషేక మగునని కౌసల్య నాకెన్నో మోదకములు పెట్టినది. ఈసంగతి యంతయు నీకు నివేదించుటకై వచ్చుటవలన నా హృదయభారము మోదకభారము కూడ దగ్గిపోయినవి.

రాజు: ప్రతిదినము నీవు మోదకములే తిందువు. రేపు రాముఁడు రాజైనను భరతుఁడు రాజైనను నీకు మోదకములకు మాత్రము లోటు లేదు చింతింపకుము.

విదూ: ఏల చింతింపను? రాముఁడు రాజైనచో కౌసల్యాదేవి బహుమోదకములచే నన్ను ప్రీతిని జేయును. భరతుఁడు రాజైనచో కైకేయి బహుతర మోదకములచే నన్ను సంతుష్టిని జేయును.

సుమం: వసిష్ఠభగవానులతో నేను ఏమి నివేదింతును?

విదూ: (జనాంతికముగా) అమాత్యా! నేనేమైన జెప్పిన నా వయస్యుఁడు కోపించును. నీకా సంగతి తెలియదు (రాజుతో) నేను మోదకములతో సంతోషింపవలెనట్లు అభిషేకవిధి ప్రారంభింపరాదని వసిష్ఠునితో జెప్పెదను.

రాజు: భగవానులు గురుపాదులు నగు వసిష్ఠులతో శీఘ్రమే తాము సెలవిచ్చిన ప్రకారము చేయుచుంటి నని నివేదించిరమ్ము.

విదూ: (అపవారించి) వయస్యునకు క్షోభ కలిగింతును అంతకుమించి నాకేమియు దెలియదు కదా! (ప్రకాశముగా) నాకు దెలియని విషయము నీవు చెప్పవు నేనడుగను ఇపుడు నాకే తెలిసినది భరతునకు నీయవలసిన రాజ్యము నా చెలికాఁడు రామున కిచ్చునట. నే నంతఃపురమున రాణులకు బయట భృత్యులకు పోరాటము కల్పింతును. శేనితో బ్రాహ్మోపదేశము చేయుదు నని యంపటమను భయపెట్టెదను.

రాజు: అమాత్యా! నే జెప్పినది భగవానులతో జెప్పిరమ్ము.

సుమం: చిత్తము. (నిష్క్రమించును)

విదూ: ఈ కపట పండితుఁడు పోయినాఁడు.

రాజు: (తనలో) చపలుఁ డగునీవటువు కలహప్రియుఁడు ఆ కలహాగ్నుల నెలుఁగఁడు ఈ మూర్ఖుఁడు క్షోభ కలిగించునేమో యని శంక కలుగుచున్నది కానిమ్ము (ప్రకాశముగా) సఖా! సుందరకా! ఏదో కథాప్రసంగవశమున రాజ్యదాయ విచారము కలిగినది. ఈ మాట యేమాత్రము నిజము?

అధిక విప్లవకరమైన యీ నృపత్వ
మేఁడ? సుకుమారచేతస్కుఁ డీ మదీయ
పుత్రుఁ డెడ? పరిహాసపూర్వక మిది
ఇందు సత్యంబు కలదని యెంచకయ్య!"

విదూ: నిత్య మా కథాప్రసంగమే వచ్చుఁ గాక!

(తెరలో)

"శక్రపురిన్ జయించి, సురసంఘము
 ద్రోలి, వలంచి వీరరాట్
చక్రము రావణాసురుఁడు శాంతి
 గడించియు భంగమందె ని
ర్వక్ర పరాక్రమ ప్రకృతి రామ
 చరిత్రము విన్న, నా డిటన్
వక్రగతిన్ నిరూఢుఁడయి వచ్చి
 జరింపుఁడు జాగరూకులై"

రాజు: (విని) ఓహో! ప్రధానాచారుఁ డగు సుబుద్ధి స్వనము వలె నున్నది. సుందరకా! నీవు పోయి నా వచనముగా వానితో "నీ మాట వింటిమి సంగతి తెలిసిన" దని చెప్పుము.

విదూ: బాబో! నేను వెళ్ళిన దారిలో నేనే రాముడననుకొని యా రావణుఁడు నన్ను బ్రమింగి వేయఁగలఁడు.

రాజు: సరే నేనే వెళ్లెదను (తనలో)

"ఒక శంక నివృత్తిం బొం
దెక యుద్భూతంబు నయ్యె, ఒక దుఃఖము నా
కకటా కొడుకులు లేమిన్,
వికలత హృదికిడె నిపుడు వేయి విధములన్"
అహా!

"సుతులు జనించినారు వర
 కూటు లటంచును వ్యాప్తి చెందె ది
క్తతి నట్టి విరోధులును
 దవ్వులయందును లేరు జొచ్చి రీ
సుతు లతిబాలకుల్ కలవ
 కూడదె వయస్సున వృద్ధుడైతి నే,
నతి బలవంతు లద్దురు ల
 హా! యెటు లింక శరణ్య మీశుఁడే"

(నిష్క్రమించును) ఇది ద్వితీయాంకము.

మెండట ఎట్లా చెప్పాను తారాసింగ్? (తలుపు విప్పాడు)

తారా ఎవరు వారు?

ఫరీద్ (అడుగుల చప్పుడుతో దూరాన్నుంచే) నేను, ఫరీదుని

తారా ఓహో హో ఫరీదుగారా రండి, రండి, దయచేయండి, ఏమిటీ వేళ ఇలా దయచేశారు

ఫరీద్ ఏముందండి? ఇంతదూరం వచ్చాను కదా అని ఓమాటు చూసిపోదామని (లోపలనుండి మూల్గువిని) అరే, ఎవరండీ అలా మూల్గుతున్నారు? ఏం పాపం, ఒంట్లో బాగులేదా? ఏమిటి ఆయన బాధ?

తారా ఎరగరూ అతణ్ణి కారవ్వాయి ఈ పక్కగొట్టులో రొట్టెలు చేసి అమ్ముతాడు

ఫరీద్ నే మెరగనులెండి బోన కాని ఎందుకండి ఆయన ఘడీఘడీమాటు తలకాయ చేతితో కొట్టుకుంటాడు? ఘడీఘడీమాటు గొంతు చేతులూ పైకెత్తి రాగం తీస్తున్నాడు కొద్దిగా మతి చెడిందా? పాపం, చిన్నవాడేనండీ

తారా (నవ్వుతూ) అబ్బే అతను కవితా వాహినిలో ఈత నేర్చుకుంటున్నాడు

ఫరీద్ ఏమిటేమిటి? రొట్టెలమ్ముకునేవానికి, కవితావ్యాధియా? తారాసింగ్! చంద్రకళని వశంచేసుకునే నేర్పుతో, నిజంగా కవిత్వం అల్లగలడంటావా? (దూరాన్నుంచి) అబ్బబ్బా, ఏమిటీ గోల నేను కవిత్వం ఆలోచిస్తూన్నట్లు తెలియదూ ఎవరు? ఓహో మీరా? ఫరీదుగారూ! ఎంతకాలానికి మళ్లా కనిపించారు సాయబుగారూ, ఎప్పుడో తిన్న చిమ్మిలికొట్టికి డబ్బు లిచ్చారు కాదు (పాడును) "లోన మధుశీలకలిత దీప మీవు"

ఫరీద్ తారాసింగ్, ఇతను తయారుచేసే రొట్టెల్లాగే వుంటుంది సుమా! ఇతని కవిత్వం (నవ్వు) బోనుకాని, నీతో ఓ విషయం మాట్లాడుదామని వచ్చాను ఏమిటీ, అది నిజమేనా ఆఖరికి కుబేరుడుగారు చంద్రకళని

తారా ఔనయ్యా, ఏం నీకు, ఆ పిల్లమీద కన్నుపడిందా? ఈ కానియ్యి మళ్ళా మొదలెట్టు కవిత్వం

ఫరీద్ కుబేరుడుగారికి చదవడం రాదు గదా మరలెందుకోయి కూతురికి చదవటం తప్పని, తండ్రి కెంత గర్వం అనుకున్నావ్

తారా బోనాను ఆమె చంద్రకళ కాదు విద్యాసుందరి చదువుల సరస్వతి

ఫరీద్ ఔను తారాసింగ్, చంద్రకళ పాదూ న్యూరాలు కాదు నాపాట వ్రాసిపెట్టేందుకు ఎంత పుచ్చుకుంటావు?

తారా ఎంతో నా, గొంతు దీనారాలు .

ఫరీద్ గొంతా? ఒకటందూ, నేనుగాని చంద్రకళని సంపాదించావా, నా డబ్బంతా నీదే

తారా సరే

తార (దూరాన్నుంచి) తారాసింగ్, తారాసింగ్, నాకు కవిత్వం రావడం లేదు ఒక పాదం వచ్చింది రెండోది ఎలాగ?

ఫరీద్ లేలిక్కింటా? మరుగ్గా మజాగా ఉండాలా? లేకపోతే, హుందాగా ఉండాలా?

తార తారాసింగ్ రెండో చరణం ఎలాగ?

ఫరీద్ తారాసింగ్, పిణ్ణి ఇక్కణ్ణించి లేవగొడితేనే కాని, నాకు భావాలు రావు ఆ మొహం చూడు పైగా గద్యంలో పద్యం వ్రాయడానికి సాహసిస్తున్నాడు

తారా ఫరీదుగారూ! బాసి మీకు ఎక్కడ కూర్చోవాలని ఉందో చెప్పండి.

ఫరీద్ ఎక్కడో అక్కడ, కొత్త విచిత్రగా ఉండాలి ఇక్కడైతే మఖ్‌మల్ పరుపులూ బాలీసులూ లేవే ఎలాగ కవిత్వం వ్రాయడం?

తారా బాసీ అక్కడ కూర్చోండి!

ఫరీద్ (దూరాన్నుంచి) ఆఁ అమ్మయ్య. కొత్త బాగుంది. తారాసింగ్, ఇదిగో ఇప్పుడే చెప్తున్నాను ఎవరొచ్చినా సరే, నా దగ్గిరకిమాత్రం రానీయొద్దు నా బుర్ర ఉండే, కొత్త నా గొడవ ఓర్పులో లేదు అంత సుకుమారమైంది కొత్త కవుకుమాట విన్నానంటే, మనస్సు చివుక్కుమంటుంది పాడు మొహం కనిపిస్తే చాలు ఓ వారంవరకూ మతి చెడిపోతాను

తారా: సరేనయ్యా బాబూ .

తార (పిట్టలనుంచి) మీ కంఠ మాట్లాడుకోవాలని ఉంటే, దూరంగాపోయి మాట్లాడుకోండి బాబూ.

ఫరీద్ (కూకే కూలా బులాలా వరసని) వాలాలా (అని కూనిరాగం తీసి) కోయిలలా గొంతులోన కోర్కెలు రేగకుంటే,

శేక్ ఇలా కొందరుండకే ఎలావుంటుందో

తార ఆఁ వచ్చింది, వచ్చింది, అమ్మయ్య

(రాగంతో) కాముడీ కాంతి లోగొన్న కోకిలమ్మ, గళము సరిచేసి ఫెళ ఫెళా పాడుమమ్మ

ఫరీద్ (కోపంతో) ఏమిటంటున్నావు తారబ్బాయి! ఉహూ, నేనుమాత్రం ఒప్పుకోను ముందట నాకొచ్చిందా భావం, కోకిల నా మనస్సుకి ముందట తట్టింది

తార అమ్మయ్య, ఇందాకటినుంచీ అంత బాగా పాడే పక్షిపేరు జ్ఞాపకంరాక గిలగిల కొట్టుకున్నాను

(రాగంతో) కోకిలా, కోకిలా, కూయవే, కూయవే

ఫరీద్ (చిరాకుతో కోపంగా) అంత దొంగలు నా ఎంగిలి తింటారే మీరు బుర్రల్లేవూ?

తారా ఏమిటేమిటి ఫరీద్? కవులూ, ప్రియులూ, మీరు, అలా దెబ్బలాడుకుంటే ఎలా? ఈ గొంతెండిపోయిన ప్రపంచానికి మీరు, భూర్భువస్స్వర్లోకాల అమృతాన్ని చిలుకుతున్నారు వద్దు దెబ్బలాడకోకండి

అప్పల అంతా వినండి వినండి నా గళం ఖరాబైపోయింది వినండి

ఫరీద్ విను, విను, విను ఈ కోకిలగురించి ముందుముందట ఇటో అటో తేలాలి

అప్ప తారాసింగ్, నేను మర్చిపోకముందే నాగేయం చెప్పేస్తాను త్వరగా వ్రాసేయి బాబు!

(పాడును) రోజారేకుల చుబుకము దాకా,
శ్యామలనీరద ఆకాశంలో
కోకిలగానము చేయవదేమి

ఫరీద్ (అడ్డంగా వచ్చి) అప్పలసామీ, ఏకే, నీ మనస్సుకి కోకిలే పట్టిందన్నమాట ఇన్నాళ్ళూ ఈ ప్రపంచంలో ఎప్పుడో నేనే దోపిళ్లు జరుగుతున్నాయనుకున్నాను ఆఖరికి భావాలనికూడా దొంగిలిస్తున్నారు ఇంకెక్కడ దాచుకోడం

అప్పల ఏమిటంటున్నావు? కోకిలా? కాదు నాకే ముందొచ్చింది మనస్సుకి తట్టింది. ఎంతెక్కడి మాట కోకిల! కోకిల!

ఫరీద్ నేనూ, పుట్టుముందట అటువంటి పక్షి ఉందంటూ కనిపెట్టినవాణ్ణి

తార (నవ్వుతూ) పక్షి ఏమి చేయ్, ఫరీదు?

ఫరీద్ ఔను పక్షి, పిట్ట కలిస్తే పక్షౌతుంది నేనే కనిపెట్టాను

భావ మీ ఇద్దరిదీ కాదు నాది

తారా కవులారా, మీరందరూ ఒక పక్షి గురించి ఈ విధంగా తగాదాపడి కాలయాపన చేస్తున్నారు చంద్రకాంతి ఒక్కటే ఏనా, ప్రతి వనం, వెన్నెల కౌగిలింతలో పులకరించడం లేదూ? అందరూ ప్రేమాతురులై ప్రేమ జపమాలని తిప్పడం లేదూ?

అప్పల బాగా చెప్పావు తారాసింగ్ కోకిల అన్నమాట నా స్వంతం కాదు కాబట్టి, మిగతావారు వాడుకోడానికి ఎటువంటి అభ్యంతరం పెట్టను

ఫరీద్ నేనుమాత్రం ఒప్పుకోను ఇదిగో, ఇప్పుడే చెప్పేస్తున్నాను కోకిలని ఎవ్వరూ కవిత్వంలో వాడ్డానికి వీలులేదు మీ కందరికీ తెలుసున్నట్టే పునరుక్తి దోషంబు పొందపోకండి.

అప్ప తారాసింగ్, ఇప్పట్లో మా తగవు తీరేట్టు కనిపించడం లేదు ఈ విషయంలో నీకు ప్రమేయం లేదు కాబట్టి, నువ్వే ఎలాగో, అలాగ, ఇదమిత్థం అని పరిష్కారం చెయ్యి

తార ఔను, అప్పలసామి చెప్పింది బాగుంది తారాసింగ్, నువ్వే చెప్పవయ్యా

భావ నాకు ఇష్టమే

ఫరీద్ సరే, అందరికీ ఇష్టమైతే నాకూ ఇష్టమే

తారా కవులారా, ఇందులో నేను పరిష్కారం చెయ్యతగినది లేముంది? మీరంతా మీ మీ గేయాలు ఎట్లా వ్రాసినా సరే, అదిమాత్రం అమరత్వాన్ని పొందాలి. పరిమళ భరితంగా ఉండాలి మీ ఇష్టమొచ్చినన్ని పక్షుల్ని వాడండి, కొమ్మల్ని

అని చాలా విచారపడేదాన్ని. ఆమెమాత్రం నాకు సంతానం లేదని ఎంత బాధపడేదో చెప్పటానికి వీలు లేదు. నిజంగా ఆమెకు బాధ అనేది ఏదైనా వుంటే ఇదేనని చెప్పాలి. ఏ విధంగానైనా సరే తన కోసమైనా కొడుకు పుట్టాలి, తాను ఎత్తుకోవాలి. ఆమె జీవితంలో అదేకవక లేకపోతే చేసిన శ్రమలైతేనేమి, అనుభవించిన బాధలైతేనేమి అన్నీ వ్యర్థమేనని ఆమె నమ్మకం. అందుకోసం ఆమె ఏది చేయటానికైనా జంకదు గొంకదు. ఈ మూఢవిశ్వాసాలను ఆధారం చేసుకుని ఆమె కొడుక్కి మారిపోవలసినవన్నీ మారిపోసింది. ఇక వది నీకు కాపరం చేయడమే కాదు, ఇక దానిని పిల్లలు పుట్టరనే కాదు, భార్య మీద భర్తకు విరక్తి కలగటానికి ఏవేవైతే అవసరమో అవన్నీ రంగరించిపోసింది. కొడుకు ఆ తల్లి మాయ మాటల్లోపడి నాతో వున్న సంబంధం ఇంకా ఎక్కువై పోసాగింది. నేనా ప్రమాదాన్ని గుర్తించకపోలేదు. కానీ ఇల్లు దాటిపోతే సమాజంలో నాకుండే స్థానాన్ని తెలుసుకోకపోలేదు. అయినా చేయగలిగినంతవరకే కదా నేను చేసేది. ఏ మానవుడైనా ఎలాంటి పరిస్థితుల్లోనైనా తనకున్న సర్వశక్తులను వినియోగించుకోగలడే కాని అంతకన్నా ఏం చేయగలడు? ఆ రాత్రిమాత్రం ఏదో ఒక అభూతమైన ధైర్యాన్ని నా శక్తిమీద మోపవస్తే అప్పటికింకా నిజంతో కూడుకున్న నా నిర్మల హృదయాన్ని బూటకపు లౌకిక్యాలు ఆవరించకపోవటాన ఉన్నదున్నట్లుగా నా హృదయంలోని విషయాన్ని విప్పి మోయించి సత్యంతో నా కేలాంటి సంబంధము లేదనీ, మాట్లాడకుండా వుండవలసిన అవసరం నాకేమీ కనిపించటం లేదని, అంత గట్టిగా చెప్పానే కాని ఇంతదాకా వస్తుందనుకున్నానా? పోనీ అప్పుడేనా ఆ క్షణాన అలా అన్నానే అనుకోండి. తరువాత ఎంత ప్రయత్నం చేశాను వారి మనస్సును మామూలు పరిస్థితుల్లోకి తీసుకురావటంకోసం? తను పలకరించక పోయినప్పటికీ ఏదో ఒకవంక పెట్టుకుని నేనే పలకరించినప్పటికీ పలికేవారు కాదు. ఒకొకసారి నేను మంచినీళ్లు తాగుతూవుంటే వారికే దాహమయ్యేదో ఏమో నాకుకూడా ఇవ్వు అనేవారు. ఏముంది సిగ్గు లేకపోతే సరి. అంత పెళ్లాంతో మాట్లాడకుండా వుండలేని వాళ్లు మూడురోజుల కొకసారి గూపులు చేసుకోవటం ఎందుకు మరి — అసలు ఆమెలో ఆమె గొణుక్కుంటూ వుండేది. అలా అనగానే వారు అడిగితేమాత్రం నేనెందుకివ్వాలా అనిపించేది. వారి కెలా వుండేదో ఏమో మళ్ళీ కొన్ని రోజులవరకు ఆ మంచినీళ్లు కూడా అడిగేవారు కాదు. ఆ రోజుల్లో రాత్రిళ్లు గడపటం మరీ కష్టంగా వుండేది. ప్రొద్దు క్రుంకుతూవుంటే ఎరి భయంగా వుండేది. ఎప్పటిలాగే ఇద్దరం ఒక గదిలోనే పండుకుంటుండేవాళ్లం. ఎరగనివాళ్ళకు మేము బాగానే వున్నట్లు కనపడేది. మేము మాత్రం మాట్లాడుకోకైనా మాట్లాడుకునే వాళ్ళం కాదు. సాధారణంగా ఎప్పుడూ ఊళ్లోనే వుండేవారు కాదు. ఉన్నప్పుడైనా అలాగే జరిగేది. నేనే ఒకొకసారి బ్రతిమాలేదాన్ని. ఒకొక రాత్రి మరీ పట్టుపట్టి అడిగేదాన్ని నామీద మీకంత కోపం ఎందుకని. వారినుండి ఏమీ జవాబే వచ్చేది కాదు. అయినప్పటికీ ఏదో ఒకటి చెపుతూనే వుండేదాన్ని.

'నేను సత్యంతో మాట్లాడకుండా వుంటానని మీకు వాగ్దానం చెయ్యలేదనా? సరే అలాగే చేస్తాను లెండి. మనం ఇలా చెయ్యటంవల్ల మనం ఇతరులకు లేని అనుమానాలకు తావిచ్చినవాళ్ళ మౌతామని తప్ప మీకు వాగ్దానం చేయలేకపోయాను గాని ఏమీ లేదు. ఆయనతో మాట్లాడకుండా వుండటమే కాదు మా ఊరే వెళ్ళటం మానెయ్యమన్నా మానేస్తాను. మనస్ఫూర్తిగా చెపుతున్నాను. నేనింకెప్పటికీ సత్యంతో మాట్లాడను.'

అని అంటూంటే ఎందుకో నా గొంతు వణకసాగింది. నేను నిష్ఠగా ఏపని పడితే ఆపని చేయటానికి తయారవుతున్నా. నేనేమో నటించి శరీరమంతా చెమటలు పట్టిపోయింది. నేనలా వాగ్దానం చేయటానికి లోపల బాధపడుతున్నా ననుకున్నట్లున్నారు.

ఇకముందు నీవు నా ఎదుట ఎలాంటి వాగ్దానాలు చేయవద్దు. నాకు నిజంగా నీతో జీవితం గడపాలని లేదు. నీవు ఉన్నా ఒకటే పోయినా ఒకటే నాకు. ఇంకా పోతేనే శ్రేయస్సును చేకూర్చినదానవౌతావు — అన్నారు. నేను తప్పు చేశానో లేదో తెలుసుకునే సమర్థతైనా వుండాలి మనిషిలో. లేకపోతే ఒకవేళ చెడి వుంటానని అనుమానమే వుంటే నా తప్పును దిద్దుటానికైనా ప్రయత్నం చేయాలి. అది ఇది కాకుండా

ఏదో ఒక నేరాన్ని నాపైన వేసి బయటకు నెట్టాలని మాచేవాళ్లతో ఇంకా నేనెందాకా కలసివుండ గలను ఇబ్బందులు వచ్చినా తిప్పలే వచ్చినా ఉద్రేకంతో అక్కడే వుండాలని ప్రయత్నం చేయటమే కాని నా కసలు ఆ మనుష్యులన్నా, ఆ ఇల్లన్నా విరక్తి కలిగింది ఏమైనా సరేనని అలాగే జీవితాన్ని గడుపుతూ వున్నాను

ఒక రోజు ఉదయం భోజనాలైన తరువాత మా అత్తగారు ఎక్కడికో బయటకు వెళ్లింది వారు నా మెళ్ళో 7 గొలుసు ఇవ్వమన్నారు ఎందు కన్నాను

ఎందుకేమిటి నీసి ఇవ్వక—అన్నారు

అంత చెప్పకూడదా ఏమిటి?—అన్నాను

అప్పులున్నవి కావాలి

అయితే మా అమ్మను రానివ్వండి ఆమెకూడా ఇవ్వమంటే ఇస్తాను లేకపోతే ఊరుకుంటే చెప్ప కోం ఇచ్చిందంటుంది నా పెండ్లికి వచ్చిన గొడవ ఇదంతా ?

మా అమ్మ ఏమన్నా అంటే నేనే వేసుకు వెళ్లానని చెప్ప దీనిలో మా అమ్మ పెత్తనం ఏమున్నది ? నీవే మర్యాదగా ఇస్తావా లేక నన్నే తెయ్యి చేసుకోమంటావా—అని గదిమారు

మీకు అప్పులుంటే నా గొలుసు కాకపోతే ఇంకేదైనా అమ్ముకోకూడదా ? మీరు ఇంటిఖర్చుల కోసం ఏమి వాడారని మీకు ఇన్ని అప్పులైనవి ? అనవసరంగా ఇంత బంగారం తీసుకు వెళ్లి నాశనం చేస్తానంటారేం ? నాకు మాత్రం చేతులమీదగా ఇవ్వటానికి ప్రాణం ఒప్పటంలేదు —అన్నాను

బాగా ఎదురు మాట్లాడటం నేర్చుకున్నావే—అంటూ తలమీద ఒక దెబ్బ కొట్టి గొలుసు లాక్కున్నారు. నాకళ్ళంబడి నీళ్లు బొటబొట కారినవి

ఇంకా ఏడుస్తున్నావా సిగ్గులేక ఇంతవరకు అనేదానవుగా—ఎన్నిసార్లు కర్రతో కొట్టమని, ఇప్పుడేం చేస్తున్నావ్ ఏడుస్తూ కూర్చోక ? అంటూ చెప్పులు తొడుక్కు వెళ్లిపోయారు

అప్పుడు పూర్తిగా తెలిసిపోయింది భార్య తప్పు చేయకపోయినా భర్తకు ఈ సంఘంలో కొట్టే అవకాశం ఉన్నదని అంతకుముందు వాకు నేను ప్రత్యేకంగా మాచుకున్నాను కాని తరువాత మాత్రం అదొక అలవాటుగా అప్పుడప్పుడు భర్తల చేత దెబ్బలు తినే స్త్రీలల్లో నేను ఒకదాననైపోయా నుగదా, అనుకున్నాను నా జీవితం ఈవిధంగా అవుతుందని ఎన్నడు అనుకోలేదు అన్ని విధాల అనుకూల దాంపత్యంలో ఉన్నా సంతోషసౌభాగ్యాలు లేకపోవచ్చుగాని, అన్ని విధాల నాకంటే హీనక పడిఉన్న భర్తచేత అవమానింప బడటం మాత్రం అసంభవమనిపించేది నేననుకున్నదంతా వ్యతిరేక మైనది నాడు ఇలా జరిగిన పక్షంలో చేయాలను కున్న పని అంతకంటే చేయలేకపోతున్నాను భర్త నిలవనివ్వకపోతే పుట్టింటికి వెళ్లితే అక్కడ గౌరవ మర్యాదల సంగతి తెలిసే వున్నా మరీ నీచమైన బాధల నుంచి తప్పించుకోటానికైనా పుట్టినింటికి వెళ్ళవచ్చు కాని సంఘం? సంఘంలో ప్రతి మనిషి తను పడు తున్న బాధలే అందరు పడాలని కోరుతూ వుండటం సహజం తనకు ఆత్మగౌరవాన్ని కాపాడ కోటా నికి సాహసం లేకపోగా ఎవరైనా అలాంటి పనికి పూనుకున్నా వాళ్ళను తిప్పి తమ స్థానంలోకి తీసుకు వచ్చేదాకా నిద్రపోరు అబ్బ ఏమి సంఘం ? నిజంగా ఈ సంఘాన్ని తలచుకుంటే చిత్రవధచేసే ఫాసిస్టును చూచినంత భయంగా ఉంటుంది

భర్త ఇష్టమైనవాడైనా సరే కాకపోయినా సరే జీవితాన్ని సమర్పించవలసిందేనని శాసిస్తుంది సంఘం ఇంతకంటే ఘోరం ఏమున్నది ? భర్తంటే ఏమాత్రం ఇష్టంలేకున్నా తెలిసినా స్త్రీని సంఘం నీచురాలుగా చూస్తుంది భర్త భార్యకు గానీ, భార్య భర్తకు గాని జీవితం సమా అదంతా సంఘానికి అవసరం ప్రతి స్త్రీకి ఒక భర్త కావాలి భర్త చెప్పినదల్లా భార్య చేసి తీరాలి అలా చేస్తున్నప్పటికీ భర్తకు ఏ ఇతర కారణాలవల్లనైనా సరే కోపంవచ్చి తిట్టినా కొట్టినా కూడా కిక్కురుమనకుండా భర్త పాదాలక్రింద ప్రాణాలు వదలవలసిందే ఇది సంఘాదర్శం ఈలాంటి సంఘాదర్శాలలో దారి తెన్ను కానరాక జీవితాన్ని విరమించుకుందామన్నా దానికి సంఘమే నిందిస్తుంది 'కాసు కాలుతూవుంటే కన్య ఎదురు చూస్తూ వుంటుందనీ, అదిపోతే దానంటివాళ్లు లక్షలొంకలైయుంది వస్తారు, చచ్చి ఎవర్ని సాధించాలను కుందో అనీ, లోకం ఇష్టంవచ్చినట్లుగా ఆడిపోసు కుంటుంది ఏమి చేయటమా అని ఆలోచిస్తూ ఉన్నాను

పొద్దుగూకినా ఇంకా పనిలోవిలన్నా పెట్టక పోతే ఎప్పుడవుద్దమ్మ మరీ బూటకంగా ఉందే —అని అంటున్నది దూర్పింట్లో మా అత్తగారు 'గొలుసు అడుగుతుంది కాబోలు ఏమి చెప్పనా భగవంతుడా అనుకుంటూ బయటకు వచ్చాన

వాళ్ళమ్మాయి పేరంటానికి పోతుందట కాసేపు నీ గొలుసు ఎరువివ్వవే—అన్నదామె నేనేమీ మాట్లాడకుండా గోడకానుకుని అలాగే నిలబడ్డాను.

పాపం నుంతోమంటే మాట్లాడలేను. ఇంత

లోకి జరిగిపోద్దా ఏం? అన్నది మళ్ళీ లేదన్నాను గొంతు పెకలించుకుని

లేదు ఏమైందీ—అన్నది ఆదుర్దాగా

అప్పు లున్నట్ట కావాలని చెవిత్వవన్నా కూడా బలవంతాన తీసుకెళ్లారు

ఎవరు వాళ్లేనా తీసుకెళ్లింది అయ్యొయ్యొ, ఇంకా నీ వేం చేద్దునే, నీ కట్టా చేతులొచ్చినియ్యో వాడి కియ్యటానికి? నేనింకా చావలేదుగా? బతికే వుంటిని గా, నాతో మాత్రం అనగూడదటే, కొంప నిలువునా ముంచితివి గదే అన్నదామె గుండెలు బాదుకుంటూ, కాసేపుండి తెప్పరించుకుని—ఎంత పోయిందే—అన్నది మళ్ళీ

చాలపోయిందన్నాను 'చాలా పోయిందీ? చాలా పోయిందంటే చాలా పోయింది ఎంత ఒయ్యారంగా చెపుతున్నావో మాకు చాలపోయిందని అవున్లే ఒయ్యారం గాక మీకేమమ్మా నీదేం పోయిందీ నీ అబ్బగాడి సొమ్మేతేగా నాకేం నాది కాదుగదా పోతే పోయిందనుకున్నావు ఇంతే చాలు అడిగే అడిగాడు నా మొగుడేగదా అని ఎగిరి గంతేసి చ్చావు ఇట్టాగన్నా వాడి మంచి సంపాదించుకుం దామని చూశావు అట్టి కనక మీ అయ్య చేయించి నదైనట్లైతే గోరంతా ఒక్క కొలిక్కి తీసుకురాక పోయావు ఇక తింగురుగాళ్లనే ఉంచావు?' అంటూ 'ఇక నువ్వు పోమ్మా మా యింట్లో కొలువులుండే నోజులు రాలేదు లేవంద ఎందుకు? ఒకో మహాతల్లి పాదం పెట్టిన నక్షత్రం అటువంటిది ఈ మహాతల్లి మా యింట్లో ఎప్పుడైతే అడుగుపెట్టిందో అప్పట్నుంచీ అన్నీ వరసన ఊడ్చుకుపోవటమే అప్పుడే అయింది మా పని ఇంకెంత ఊడ్చుకుపోవాలో ఒకో గొడ్డొచ్చిన యోగ్యం బిడ్డొచ్చిన యోగ్యం అంటారిదే కావాల నా కూతుళ్లు ఎక్కడ పాదం పెడితే అక్కడల్లా బంగారం అయిపూరుకుంటుందంటే ఇంత దరిద్రప మొకందీ, గొడ్డుబోతుదీ మా దగ్గర దాపరించిందో మరి' అంటూ యీ వరసన ఒకటే పాట పాడటం మొదలు పెట్టిందామె ఎంతసేపు చూచినా పూరుకుంటుం దేమో అంటే పూరుకోదు. నాకు విసుగు వచ్చి, చీవాట్లు, తాగుళ్లు, తిరుగుళ్లు అన్నీ కప్పిపెట్టి, నా గొంతు కోసిందికాక పైగా నాకు బడెందుకు ఎప్పుడు అట్లా ఏడుస్తావు? అంటూ లోపలకు పోయి పండుకున్నాను

ఆ రోజునుంచీ మరీ కక్ష పట్టిందామె నా మీద ఇక ఆ ఇంట్లో నాకొకనిమిషం ఒకయుగంగా గడుస్తూ ఉన్నది. ఎన్నాళ్లు చూచినా వారు ఇంటికి రాలేదు. వారసలు నామీద అలా అనుమాన పడటానికి కారణం ఆ తిరుగుడే నసుకోండి. అక్కడ ఒకావిడ ఉన్నది తాను వారిని శాశ్వతంగా తన స్వాధీనంలో వుంచుకోటానికని కల్లిబొల్లి ఖబుర్లన్నీ కల్పించి చెప్తూ వున్నది నామీద విరక్తి కలిగించటానికని ఇంటికి వస్తే తల్లి కూడా అలాగే నాకూ అసలు మనిషిలో స్వయంగా ఆలోచించుకో గలిగిన శక్తి లేకపోవటం వల్లనే ఇలాంటి ప్రమాదాలకు గురి కావలసివస్తూ వున్నది అక్కడకు వెళ్లి వచ్చారంటే సరి ఏదో ఒక తగాదా తీసుకురావల సిందే అక్కడకు వెళ్లి వచ్చినప్పుడల్లా ఏదో ఒక తగాదా జరుగుతూ వుందని ఎక్కడికి వెళ్లి వస్తున్నా సరే, ఆ చెప్పుల మోత వినపడితే చాలా భయంగా ఉండేది ఒకోసారి ఆ చెప్పుల అడుగులు నా హృదయంలోనే పడుతున్నంత బాధగా ఉండేది వీరు వస్తారంటే భయంగానే వున్నప్పటికి ఇంట్లో పోరు మరీ ఎక్కువై పోవటాన వారు వస్తేనైనా కొంత పోరు తగ్గిపోతుందేమోనని ఎదురు చూస్తూ వుంటే ఎంత కాలానికి రానేలేదు

ఏమీ తోచక మళ్ళీ పుస్తకం చదువు కుంటున్నాను ప్రక్కనే ఇంకొక పుస్తకం వున్నది కాసేపటికి పొరుగింటి అమ్మాయి వచ్చి నా ప్రక్కనే కూర్చున్నది నేను చదువు కుంటున్న పుస్తకం చూసేని ఏమిటమ్మాయి అన్నాను ఏమీ లేదు వూరికే వచ్చాను మరి, ఇప్పుడే మీరు కాపురాన్నాంగా? అన్నది 'ఊఁ సరేలే' అన్నాను మళ్ళీ నేను చదువుకుంటు న్నాను ఆ అమ్మాయి కొంచెం సేపుండి లేచిపోయి నట్టుంది నేను మరల రెండవ పుస్తకం తీసి చదువు కుంటున్నాను అంతలో చెప్పులు కూడా చప్పుడు చెయ్యకుండానే ఒక్కసారి లోపలకు వచ్చారు వారు నేను ఉలిక్కిపడి లేచి నిలబడ్డాను నా చేతిలో పుస్తకం తీసుకున్నారు 'నీకెన్నిసార్లు చెప్పాలి? బుద్ధిలేదు? చదివిన పుస్తకమే ఎన్నిసార్లు చదువుతావు? కనీసం వాడి పుస్తకమైనా మూడ కుండా ఉండలేకన్న మాట నాతో నీవు ఎన్ని మాయమాటలు చెప్పావు? ఇక వతనితో మాట్లాడ వనీ, మా వూరికి కూడా రావనీ చెప్పలా? నన్నవత లకు పోనిచ్చి మళ్ళీ ఇదేంపని? అసలు నీ మనసులో లేకుండా వుండాల గాని నిర్బంధంవల్ల నీ అలవాట్లను

ఎందాకా మార్పులో గలవులే—అన్నారు ఒక్క గుక్కన

చదువుకోడాని కింకేమీ పుస్తకాలు లేకపోవ గావ, మాట్లాడటానికి కూడా ఎవ్వరు లేకపోగాన చదివిన పుస్తకమే చదువుకున్నాను కాని అంత కంటే ఏమీ లేదు అంత మంచి ఆయనమీద కూడా ఎందుకు చేస్తారు నిందలు—అన్నాను సహించలేక

అవును ఇష్టమైతేసరి అల్లాగే ఉంటుంది వాళ్ళు అంత మంచివాళ్ళేం ఈ రోజునుంచీ నీ వసలు వా కళ్ళకు కనపడ్డావంటే ప్రాణం తీస్తా నీమనస్సంతా ఎవరిమీదనో పెట్టుకుని హాతో రాసుకుంటున్నట్లుగా నటించుదా మనకుంటున్నావు కాబోలు అవన్నీ నా దగ్గర సాగవు పో ముందు—అంటూ బయటకు నెట్టారు నే నింకో గదిలోకి పోయి వెక్కి వెక్కి ఏడుస్తున్నాను

ఏయ్ ఇట్రా అన్నారు మళ్ళీ గద్దిస్తూ నేను వెళ్ళకపోయినా వారైనా వచ్చేటట్లున్నారని నేనే మళ్ళీ ఆ గదిలోకి వెళ్ళాను, పెద్దపులి నోటిలోకి పోతున్న మేకపిల్లలాగా

[సశేషం]



చిత్రకారుడు శ్రీ బంకిం సర్కార్ శాంతినికేతనం

# కలగూరగంప

## నన్నెచోడ కవికాలము—ఒక మనవి

నన్నెచోడకవి నన్నయకంటె ప్రాచీనుడని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును, శ్రీ శే వడ్డాదు చుటి వీరరాజు పంతులుగారును చాల కాలము క్రిందట చెప్పియుండిరి తరువాతి పరిశోధకులు ఈ కవిరాజ శిఖామణి నన్నయకు తరువాతి వానినిగా నిశ్చయించుచు వచ్చిరి

ఇటీవల శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు తాను పది సంవత్సరముల కాలములో జేసిన పరిశోధన ఫలముగా 'నన్నెచోడకవి చరిత్ర' అను పేర విపుల విమర్శ గ్రంథము వ్రాసి నన్నెచోడుడు నన్నయకు గొంతెము పూర్వుడును, సమకాలికుడును కావలయునని నిరూపించిరి దానిలో వారు పెదచెరుకూరు శాసనమును, నన్నూరుపాడు శాసనమును, కుమార సంభవాంతర్గతములగు కొన్ని పద్యస్థ కాలములను ఆధారముగగొని కవిరాజ శిఖామణి నన్నెచోడుడు క్రీ శ 1028-58 ప్రాంతపువాడని సిద్ధాంతీకరించిరి

అంతట శ్రీ వేలటూరు వెంకటరమణయ్యగారు 1951 సెప్టెంబరు భారతిలో 'నన్నెచోడకవి కాలము—ఒక సూచన' అను వ్యాసమున నన్నెచోడుడు నన్నయకంటె ప్రాచీనుడను తన నమ్మకమును దృఢపఱచు కొన్ని విషయములు చెప్పి నన్నెచోడుడు క్రీ శ. 940—70 ప్రాంతపు వాడని చెప్పుచున్నారు. ఆ విషయములందు నాకు తోచినవి సందేహములు నిట తెలుపుకొనుచున్నాను.

బద్దెన

బద్దెన నీతిశాస్త్ర ముక్తావళికర్త, దత్తమండల కావ్యయనియు, కమ్మనాటి తెనుగుకావ్య కాదనియు శ్రీ వెంకటరమణయ్యగారు సూచించి యున్నారు కమ్మనాటి పొన్నిడి శాసనమందలి 'జటాచోడ' వంశములో 'నన్నిచోడ [స్సు] ధీః' అను దాత యుండినున్నట్లు కనిపించుచున్నది ఆ శాసనము నూదని పాడు దానమును తెలుపుచున్నది ఈ 'నన్నిచోడ సుధీ' పండిత కవి మాత్రమే గాక దాత, రాజాగా గూడ నున్నాడు 'శాకే—నిధి దివి వ్యోమ తుహిన సమ్మితే' అనగా ఇది శా శ 1009 (క్రీ శ 1087) కాలము అగుచున్నది కాని ఈ నన్నచోడ సుధీ తండ్రి పేరు శాసనములో స్పష్టముగా లేదు. బల్ల రాజని చెప్పుట కవకాశము లేదు పైగా ఈ 'సుధీ' కమ్మనాటి వాడు కనుక ఇతడు కుమార సంభవ కర్తయగు పాకనాటి నన్నెచోడకవి కాడు. ఇతడు నన్నెచోడ నరేంద్రుడను బద్దెనకవియగు నేమో తెలియదు నీతి పద్యములు రచించిన బద్దెనకు 'నన్నెచోడ నరేంద్రు'డను నామాంతరమున్నట్లు బద్దెన నీతి పద్యమకుటము వలన తెలియుచున్నది కాన నీతికర్త బద్ది భూపతియు, శాసన దాత నన్నెచోడ సుధియు ఒక్కరే యనుటకు వీలున్నదో లేదో పరిశీలింపవలసియున్నది

### మల్ల ప్రభువు

నన్నెచోడుడు తన కుమార సంభవములో

' జంగమ మల్లయ పేర నస్తపం
తానము లొప్పనిల్పెదు ముదంబున
దత్ప్రభు నాజ్ఞ పెంపువకా.'

* * *

"గురుఁడున నిష్టదైవమునకుఁ బతికిఁ
  గృతి చెప్పి పుణ్యమునఁ
పరమును దేజమున్ బసియ
  దప్పుజగంబుల నిశ్చయంబు స
ద్గురుఁడు నిష్టదైవమును
  బూర్వనిశేషుఁడు దానవారిగా
గొరనకు నిట్టుసేయుగా
  నెుక్కట లాభము లెన్నియన్నియున్"

అనియు చెప్పియున్నాడు. ఇందలి గురువు, ఇష్టదైవము, నిశేషుడు అను పదముల మూలమున 'మల్లయ్య' అను గురునామ సామ్యమును గ్రహించి శబ్దశక్తి ధ్వని మూలమున గురువు జంగము మల్లయ్య, ఇష్టదైవము శ్రీశైల మల్లయ్య, నిశేషుడు త్రైలోక్య మల్లయ్య అని శ్రీ రెడ్డిగారు నిరూపించిరి. పై పద్యములో 'నిశేశ' విషయమున కనుకూలముగ సాయ మిచ్చు 'సోమ మనుష్యరూప మల్లికార్జునుఁ' అను సోమేశ్వర త్రైలోక్య మల్లయును శ్రీ రెడ్డిగారు చూపిరి. దీనివలన నన్నెచోడుని కాలములో నున్నవాడు సోమేశ్వర త్రైలోక్య మల్లయ్య అని యే తలంపవలయును. కవి తాను తొలుత చేసిన ప్రతిజ్ఞకు అనుకూలముగ గూఢ వస్తుమయ కావ్య నిర్మాణమందు కృతకృత్యు డైనట్లు శ్రీ రెడ్డిగారు నిరూపించిరి. గూఢ వస్తుధ్వని చూపుట ప్రాచీనాలంకారిక సమ్మతము.

శ్రీ వెంకటరమణయ్యగారు తన వ్యాసములో 'త్రైలోక్యమల్ల' పదము బిరుద నామముగాని వ్యక్తి నామము కాదనియు, 'త్రైలోక్యమల్ల' బిరుదును బట్టి 'సోమేశ్వర' వ్యక్తిని ఊహించుటకు వీలులేదనియు, కళ్యాణి చాళుక్యులకు పాకనాటి తెలుగు చోళులు సామంతులు కాదనియు, వైదుంబ వంశజుడగు భువన త్రినేత్రుడనువాడు నన్నెచోడుని సంహరించి క్రీ శ 972 లో పాకనాటిని ఆక్రమించి యుండునని యు, నన్నెచోడుడు ధ్వనింప జేసిన 'నిశేషుడు పూర్వ చాళుక్యరాజగు ఇమ్మడి యుద్ధమల్లుడనియు, అందువలన నన్నెచోడుడు క్రీ శ 940—70 ప్రాంతములోనుండి యుండవలెననియు చెప్పుచున్నారు.

అయితే వీరు 1951 జనవరి భారతిలో ప్రకటించిన 'రాజరాజ నరేంద్రుడ'ను వ్యాసములో "క్రీ శ 1044 నకు ఆ తరువాతి సంవత్సరమునకు కళ్యాణ చాళుక్య చక్రవర్తి త్రైలోక్య మల్లాహవమల్ల బిరుదాంకితుడగు మొదటి సోమేశ్వరుడు వేంగీరాజ్యమును జయించెను. అది మొదలు క్రీ శ 1060 పర్యంతము వేంగీ మీద అతని అధికారము చెల్లినది. రాజ రాజ నరేంద్రుడు కళ్యాణి చాళుక్యుల కరిగా పాలించు' అని నిర్ణయించియున్నారు. అట్లగుచో పాకనాటిమీద కళ్యాణి చాళుక్యులకు ఎన్నడును ఆధిపత్యము లేదనుట శ్రీ వెంకట రమణయ్యగారు చెప్పినట్లు సత్యముగాదు. ఇందు వ్యవచన వ్యాఘాతము కలదు. ఇంతియేగాక ఆ కాలమున (క్రీ శ 1048–57) పాకనాటికి చక్రవర్తి యెవరో అను విషయమును శ్రీ వెంకటరమణయ్యగారు శాసనాధారముతో నిరూపింపలేదు.

'ఉదయాద్రి ప్రభు శృంగం బెక్కినట్లు' అనగా ఉదయగిరి ప్రభువుయొక్క ప్రభుత్వము అనగా పాకనాటి ప్రభుత్వమును స్వీకరించినట్లు గ్రంథాధారముతో శ్రీ రెడ్డిగారు చెప్పుచున్నారు. '(ద్వాదశార్ధార్ధనయను) అయ్యుదయాంగము' అను గీతపద్యమందలి 'పాకనాటి విరువదియొక్క వేయి' ఇత్యాది జేశకాలములను శ్రీ రెడ్డిగారు లెక్కతో నిరూపించి ఉదయగిరి పాకనాటిలోనిదని నిరూపించిరి. ఇంతేగాక 'స్వస్తి సమస్త—ఉదయ పర్వత శిఖరాగ్ర రోహణ వర్ధన' అను కవి కూచిమను గూడ చేర్కొనిరి. పెదచెరుకూరు శాసన కాలయుగు 'కందుకూరి పురవరేశ్వర పాకనాంటి విషయ ఏకవింశతి సహస్ర గ్రామావనీ వల్లభ మల్లిదేవ చోడ' అనువానిని కందుకూరు పాకనాటి రాజ్యమునకును, ఈ మల్లిదేవ చోడుని తాత ముత్తాతయగు నన్నెచోడ కవియొక్క ఉదయగిరి పాకనాటి రాజ్యమునకును దగ్గఱ సంబంధమున్నదిగాని, కడపజిల్లాలోని పసెుటి పాకనాటికి, కందుకూరి తూర్పు పాకనాటి రాజ్యమునకు సంబంధముండియుండదని స్పష్టమగుచున్నది.

పాకనాటి నన్నెచోడుడు శ్రీ వెంకటరమణయ్యగారు చెప్పినట్లు కళ్యాణి చాళుక్యులకు సామంతుడు కాడని అంగీకరించినను ఈ క్రింది విషయము మరువరాదు. కంచి అరవ చోడులకు తూర్పు తెలుగు చాళుక్యులకు మధ్య నన్నెచోడుని పాకనాటి రాజ్య

ఉన్నది. పశ్చిమమున కళ్యాణి చాళుక్యుల కర్ణాటక రాజ్యమున్నది. అరవ చోడులకును కళ్యాణి చాళుక్యులకును మధ్య కొన్ని యుద్ధములు జరిగినవి. ఆ యుద్ధములలో తూర్పు చాళుక్యులు తమ బంధువులగు కంచి అరవ చోడులకు సాయము చేయకుండుటకై కళ్యాణి చాళుక్యులు తెలుగు చోడులకును, తూర్పు చాళుక్యులకును మధ్య యుద్ధములు కల్పించి తంత్రములు పన్నియుండవచ్చును. అట్టి సందర్భములలో రాజ్య తంత్రముల ప్రకారము నన్నెచోడుడు ప్రధానముగ కళ్యాణి చాళుక్యులకు సామంతుడు కాకపోవచ్చును. కాని కళ్యాణి త్రైలోక్య మల్ల సోమేశ్వరుడు ప్రబలుడు కాబట్టి వాని మూలమున తనకు లాభము రావచ్చునని తలంచి అతనికి ప్రతికూలము కాకుండ అనుకూలముగ నుండుటకు యోచించి అతని శక్తి సామర్థ్యములు తనకు తోడ్పాటుగా నుండునని తలంచి అతనిని తనకు 'కూర్చుని జేసి'నగ కవి చెప్పికొనెనని చెప్పుటకు అవకాశము లేకపోలేదు. అన్నిటికి శాసన ప్రమాణములు చూపినప్పుడే ఈ విషయమునకు శాసన ప్రమాణము లేదన వీలుండును.

ఒక గ్రంథములోని ఒక విషయమును ఆధారముగ గొని ఒక నిర్ణయము చేయుట కుపక్రమించితిమేని, అందులకు ఉపోద్బలకములును, గ్రంథస్థములును, శాసనానుకూలములును అగు నితర విషయములను గూడ గమనింప వలయును గాని ఏకదేశ మంత్రము గ్రహించి ఇతర ప్రధాన ప్రమాణములను త్రోసి రాజనుట యుక్తము కాదు. విలయన కావ్యమందలి 'జంగమ మల్లయ సేర సప్త సంతానము లొప్ప నల్పుదు మదంబున దత్ప్రభు 'సాజ్ఞ పెంపునన్' అను ప్రభువు సాధారణముగాగొని గురువు ఇష్టదైవము, నిజేశుడు హరి ముఖ్యరికి కొలవాయు సామ్యము స్వీకరించి నిజేశుడుగనుండు త్రైలోక్య మల్ల సోమేశ్వరుడే తన ప్రభువని కవి చెప్పికొనుచుండగ అతడు కాదు 'ఇమ్మడి యుద్ధమల్లు'ని గ్రంథేతరాధారములతో జేతొకనిని గ్రహించుటలో ఔచిత్యము లేదు. యుద్ధమల్లుండు అను నామము గూడ బిరుదముగ చెప్పవచ్చు, ఇమ్మడి యుద్ధమల్లుని కొరకు 'మల్లపరాజు' అను పేరున్నట్లు బెజవాడ శాసనములో కలదని చెప్పవచ్చు, అటులే మనుమడగు రెండవ (ఇమ్మడి) యుద్ధమల్లునికి గూడ 'మల్లణ్ణు' అను పేరుగలదని శ్రీ సంకట రమణయ్యగారు ఊహించుచున్నారు. కాని బెజవాడ శాసనమునందీ విరోధము గలదు

'స్వస్తి నృపాంకుశాత్యన్త వత్సల సత్యత్రినేత్ర విస్తర శ్రీ యుద్ధమల్లు డ్దన వద్యవిఖ్యాత కీర్తిః ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు సకల వస్తువమేతుణ్డు రాజసల్కి భూవల్లభుణ్డర్థిన్'

ఇందు ఇమ్మడి యుద్ధ మల్లునికి 'రాజసల్కి' అను అసలు పేరున్నట్లు స్పష్టమగుచున్నది. ఇది 'భీమసల్కి' వంటి వ్యక్తి నామము కాగా శ్రీ సంకట రమణయ్యగారన్నట్లు రెండవ యుద్ధ మల్లునికి 'మల్లణ్ణు' అను అసలు పేరు లేదని చెప్పక తప్పదు. కాబట్టి ఈ రాజసల్కి కుమార సంభవ కృతిపతి కాదు. ఇక్కడ కూడ రెడ్డిగారు చెప్పినట్లు ('యుద్ధ బిరుదు వదలిన) 'మల్ల' శబ్దమే శ్రీ సంకటరమణయ్య గారికి తారకమగుచున్నది. ఎట్లయినను 'రాజసల్కి' అను అసలు పేరుండుటవల్ల 'మల్లణ్ణు' అను బిరుదు పేరు యుద్ధమల్లుండను అను బిరుదము నుండి జనించి దనుటకు వీలులేక పోలేదు. ఇట్టిదే త్రైలోక్య మల్ల బిరుదమునుండి పుట్టిన మల్లయ్య పేరు కూడ. శైవములో 'మల్ల' శబ్దము సమయానుకూలముగ 'శెట్టి–మల్లయ్య' అను రెండర్థములను సాధించుననుట నిరాక్షేపము. కావున శ్రీ రెడ్డిగారి వాదమే గ్రంథాధార సమ్మతము. లేనిచో చారిత్రికుల వాదమునకు కూడ ఈ 'మల్ల' బిరుద నామ దోషము సంక్రమించుచున్నది.

మఱియు నన్నెచోడుడు తన గురువును కథానాయకునిగా ప్రవేశపెట్టి వర్ణించిన ఘట్టములో 'త్రైలోక్య పూజ్యా' అని యొక చోటను, 'సోమ మనుష్యరూప —మల్లికార్జునా' అని మఱియొక చోటను పేర్కొనియున్నాడు. ఇంతియేగాక నాగబంధమందలి 'సోమశేఖర విస్ఫురితరమా దయా రసయుతా' అను సమాసములో తన గురువు సోమదేవుని దయా పాత్రుడుగా నన్నట్లు కవి చెప్పి కొనియున్నాడు. ఇయ్యది శివస్తోత్ర పరమైనను శబ్ద శక్తి ధ్వనిచేత త్రైలోక్య మల్ల సోమేశ్వర ప్రశంస కూడ నగుచున్నది. శ్రీశైల మల్లయ్యను గ్రంథాధారముచే నిరూపించినట్లు తత్ప్రభువు త్రైలోక్య మల్లయ్యను గూడ గ్రంథస్థాధారముచే నిరూపింప వలసి యున్నది. శ్రీ వెంకటరమణయ్యగారట్లు చేయక గ్రంథేతరాధారములతో కాలాంతర

ము ను స్వతంత్ర్యాంతరమును సాధింపబూనుట సముంజసముగా గాని, యుక్తాయుక్తముగా గాని దోపదు భూశిపేట శాసనములో 'త్రైలోక్య మల్లమహాధీశాత్ శాసనబద్ధం, అను బిరుదనామము సోమేశ్వరశక్తి నామముగా వాడబడి యున్నది

## బల్లయ

శ్రీ వెంకట రమణయ్య గారు పేర్కొన్న మందాడ గ్రామ శాసన దాతయగు 'పాకనాటి బల్లయచోళ మహారా'జే ఈ కమ్మనాటి బొప్పిడి శాసనమందలి పాకనాటి బల్లి భూపతియైనచో ఇతనికి నన్నెచోడు డని కొడుకున్నట్లు ఊహించుటకు వీలు లేదు ఇచ్చట శాసన భాగము శిథిలమైయున్నది ఈ బల్లయచోడ మహారాజునకు నన్నెచోడుడను కొడుకున్నట్లు శ్రీ వెంకటరమణయ్యగారు ప్రమాణము చూప లేదు బల్లయనామము మాత్రము గ్రహించి అతనికి 'నన్నెచోడు'డని కొడుకుండునని—అతడే కుమారసంభవ కావ్యకర్త, అతడే పాకనాటి కధిపతి, అతడే వైదుంబ త్రిభువన నేత్రునిచే జంపబడినవాడు అని చెప్పుట ఊహాతీతముగా నున్నది

ఈ జటా చోడ వంశము వారు కూడా ఒరయూరి పురాధీశ్వరులుగా నుండి దశ వర్ష కాలము నుండి పాత్రిపి పాకనాటి కధీశ్వరులైనట్లు, కమ్మనాటి నివాసులైనట్లు కమ్మనాటి బొప్పిడి శాసన వాక్యములు తెలుపుచున్నవి ఇట్లే క్రీ శ 902 ప్రాంతమున కృష్ణా తీరమున బీచుపల్లి శాసనములో కూడ నొక చోడ బల్లి దేవుడున్నాడు అతనికి కూడ నన్నెచోడుడని కుమారుడుండెననియు శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారును, కీ శే నండూరి వీరరాజు గారును సూచించియున్నారు అట్లే యది యూహకు చెందినదే గాని శిలాపత్రికము కాదు గ్రంథాధార చరిత్రతో సమన్వయ పడుచు చోడబల్లి కొడుకు నన్నె చోడుడను పెద చెరుకూరు శాసన చరిత్రను నమ్మకపోవుట చిత్రముగా నున్నది

## శైవ మతము

తెలంగాణా యందలి వేములవాడ శాసనములో 'త్రిభువన మల్ల సామంత చూడామణి శ్రీ మదరి కేసరి' కాలమున (సాక్షి) మల్లికార్జున భట్టారకుడు ఒకడు కలడు గాని ఇతడు శ్రీ వెంకటరమణయ్యగారు చెప్పినట్లు కాలాముఖ శైవ మతమునకు చెందినవాడని చెప్పుటకు శాసనాధారము కనబడ లేదు ఇందలి 'మల్లికార్జునస, ముక్తిలింగి, విద్యాసరాది భట్టార కాశపాత్రికా' అను పాఠము గమనింపదగియున్నది ఇందలి 'భట్టారకా' అను బహువచనముపై సుస్ఖరి వ్యాఖ్యల కన్వయించుచున్నది కావున ఈ భట్టారకులు కాలాముఖులని వీలు లేదు మల్లికార్జునుడు, ముక్తిలింగి, విద్యాసరుడు మొదలగువారి ప్రత్యేక నామములు

## తెంకణము

'తెంకణాధారిణీ పెన్న' పరిణామము లోనిదని శ్రీ వెంకట రమణయ్యగారు చెప్పుచున్నారు అనగా తెంకణ దేశమనది అనంతపుర మండలమందలి తాడిపత్రి సమీపమునుండి పూర్వ వాహినియై ప్రవహించు పెన్నానదీతట ప్రాంతమని చెప్పుట కవకాశమున్నను తెలంగాణా ప్రాంతమందలి అలంపుర శాసనములో "హాల బాలియ తెంకణాదిపయ [స] కలిమర్తుడు" "మరాజను డొం చెవినిం తెంకలు కొట్టమక్తుక"

అను తెంకణభూమి వాడబడియున్నది దీనిని బట్టి తెలంగాణా ప్రాంతములో కూడ తెంకణ దేశ భాగమున్నట్లు తెలియుచున్నది ఇట్లే కళింగ దేశ ప్రాంతములో 'తెంకణలు' సంస్థాన మున్నది కావున ఇవి యన్నియు ఒకప్పుడు తెలుగు జాతికి చెందిన పూర్వ దేశములై ఆ పూర్వ నామములతో వ్యవహరింపబడినట్లు తలంప వచ్చును అదియును గాక 'తెంక (ణ) శబ్దమునుండియే క్రమముగా 'తెకాణ'—'తెలగు', 'తెనుగు—తెనుగు' దేశ భాషా పదము పుట్టినదా అను జిజ్ఞాస కలుగుచున్నది

## ముగింపు

పరిశీలింపగా శ్రీ రెడ్డిగారు వ్రాసిన నన్నె చోడకవి చరిత్రలో అన్ని విధములైన ఉపపత్తులచే ఈ కవి క్రీ శ 1028—58 ప్రాంతములో నుండెనని నిరూపితమగుచున్నది గర్భకవిత్వము వ్రాయునలవాటు నన్నె చోడునికి గలదు

'అసిధార బాస్పవ గజ—యకాంత కాంతరద,
దరవాతి ఖడ్గలతిక—యమైత్ర సంపద'

'కరికాల పాదు' అను చంపక మందలి ని జంపె రగడ—ఖడ్గ బంధము

ఇది 'జయచంద్ర చంద్రుల (విక్రమశక 1111 రేఖల) లో ధ్వనించుచున్న శుద్ధపక్షమును, తిగవంటె కత్తి (8 కృత్తిక) నక్షత్రమును, జయశంవత్సర మందలి చైత్రమాస విస్తారమును (జయజయ ధ్వని) 3—జయతిథియు, 3—జయ (మంగళ) వారమును ఖడ్గధారాబంధమందు స్థిరముగా అతిశయించెను' అను విక్రమశక కాలమునకు సరియగు క్రీ శ 15-8-1054 తేదియగుచున్నది దీనిలో స్వల్ప కాలవ్యత్యాసము కూడ లేదు ఇట్లు యుక్తి కవి 'దైవజ్ఞునట్లు' ప్రతిజ్ఞ నిర్వహణము తుల్యకారకముగా, తిరముగా జేసి చూపినప్పుడు ఈ విషయావళిని సంపూర్ణముగ విస్మరించి గ్రంథమందలి 'మల్ల—ప్రభు' కాలమును రెండవ యుద్ధమల్లుని కాలముతో నిర్ణయించుటకు వీలులేదు, ఈ గద్యకవిత్వ పద్యకాలముకూడ యుద్ధమల్లుని కాలముతో సమన్వయము చేయగలిగినప్పుడు శ్రీ వెంకటరమణయ్యగారి వాదములోని సత్యము గోచరించును అంతియకాక తుల్యతిథి వార నక్షత్రాది విషయములన్నియు సమన్వయ పడిన గద్యకవి నన్నెచోడుని యొక్క ఖడ్గబంధ రగడ కాలమును త్రోసివేయుటకు వీలులేదు.

ఇది గాక ఈ కవిరాజ శిఖామణి ప్రాచీన ప్రయోగ భాషా చరిత్ర కాలమును శ్రీ వెంకటరమణయ్యగారు సకారణముగ జూపనిదే ఈ గ్రంథ ప్రాచీనత క్రీ శ పదియవ శతాబ్ద ప్రాంతముగదనుటకు వీలులేదు శ్రీ రెడ్డి గారు చెప్పినట్లు కవి మార్గము నాశ్రయించి స్వాతిగా, నూతనముగా, వక్రోక్తిగా, యుక్తిగా తన కాలమును ఆయా చోటుల వివరించెనని తలంపదలయును ఆ విషయములన్నియు నిట నుల్లేఖించుట ప్రసక్తము కాదు

శ్రీ పిన్నంరాజు వెంకట సుబ్రహ్మణ్యశర్మ.

---

# మన ప్రాచీన వాద్య యంత్రములు

వాద్య విద్యావేత్తలగు మన ప్రాచీనులు వాద్య యంత్రములను నాల్గు భాగములుగా విభజించియున్నారు 1, తతము అనగా తంత్రీ గతము 2, అనద్ధము అనగా చర్మబద్ధము 3, సుషిరము అనగా రంధ్రము గలది 4, ఘనము అనగా లోహ నిర్మితము

తంత్రులుగల వాద్య యంత్రము సాధారణముగ వీణయందురు సంగీత దామోదరమున దీనికి 29 రకముల భేదములు విస్తృత వివరణము గలదు ఆ గ్రంథములో చెప్పిన భేదములు వాని పేరులు నివి అలావణి, బ్రహ్మవీణ, కిన్నరి, లఘుకిన్నరి, విపంచి వల్లకి, జ్యేష్ఠ, చిత్ర, ఘోషవతి, జయ, హస్తిక, కుబ్జిక, కూర్మి, సారంగి, పరివాదిని, త్రిశవి, శతచంద్రి, నకులోష్ఠి, ఢంసవి, ఔదుంబరి, పినాకి, నిశ్శంక, శుష్కల, గదావారణహస్త, రుద్ర, స్వరమండల, కపిలాస, మధుస్యంది, ఘోణ

నారదకృత సంగీతమకరందమున 19 విధములైన వీణలుల్లేఖించబడి యుండెను సారంగదేవుని అభిప్రాయములో వీణలు 11 విధములేయని తెలియుచున్నది

వీణాదండము బోలు కర్రవలనను, తీగ, నరములతో అల్లిన త్రాళ్ళు, జనుము, లేక నూలు మొదలైన ఉపకరణములతో తయారు చేయబడును వీణను నిర్మించుటకింకను ప్రధానోపకరణము "అలాబు" అనునది కలదు అలావణీ వీణ నిర్మాణ పద్ధతి సంగీత దామోదరమున నిట్లు వ్రాయబడియున్నది

కనిష్ఠికా పరిణద్ధి మన్యచ్ఛిద్రేణ సంయుతః
దశయష్టిమితో దండః ఖాదిరో వైణవో౽థవా॥

అధః కరభవా మూర్ధ్వ స్త్రిశల్యాభి శోభితః
నవాంగులాద ధచ్ఛిద్రోపరి చంద్రార్ధసన్నిభాం
నివేశ్య చుంబికాం భద్రాలాబు ఖండం నివేశయేత్
ద్వాదశాంగుల విస్తారం దృఢపక్వం మనోహరం ॥

తుంబికావేధ మధ్యేన దండ చ్ఛిద్రేషు నిర్మితం
అలాబు మధ్యగాం డోరిం కృత్వా స్వల్పాంత్తు కాష్ఠికాం॥

తథా సంవేష్టయిత్వా తిస్ర్యగ్భ్యో కాష్ఠికాం భ్రామయేత్తతః
యయా పార్శ్వన్నిశ్చ లాలా బుర్బంధశ్చ కరభోపరి॥
పంచాంగులిషు సంత్యజ్య వ్యాలాబుం స్వల్పాంచ బంధయేత్
శలాంత నిర్మితా పట్టమయీ మాత్రకృతాథవా॥
సమా సూక్ష్మా దృఢా తత్ర తంత్రీ జేయా విచక్షణైః
ఏ తల్లక్షణ సంయోగా దలావణీ ప్రకీర్తితా॥

## 2 అనద్ధములు.

చర్మాచ్ఛాదిత వాద్యమును పూర్వకాలమున ఆనద్ధమని అవనద్ధమనియు చెప్పెడివారు విభిన్న సంగీత గ్రంథములలో దీనికెన్నియో భేదములు చెప్పబడెను. ఆనద్ధ వాద్య యంత్రములలో గొన్నింటి పేరులివి—మురజము, పటహము, ఢక్కా, విశ్వకము, దర్పవాద్యము, ఘనము, పణవము, సరుహా,

లావజము, జాహాళము, త్రివళి, కరటము, కమఠము, ఝల్లి, భేరి, కుడుక్క, హుడుక్క, ఝుణపమురళి, ఢుక్కలి, డౌండి, శాణము, డమరు, ఢమకి, మడ్డు, కుండలి, స్తుంగము, దుందుభి, అంకము, మర్దళము, అణీకస్థము ఇందు దుందుభి భేరి మొదలగునవి రణ వాద్యములు సంగీత శాస్త్రకారుడైన భరతుని అభిప్రాయములో మర్దల మృదంగమే సర్వోత్కృష్ట వాద్యము మర్దల నిర్మాణ విషయమున గూడ శాస్త్రములో వ్రాయబడెను దీని మధ్య భాగము స్థూలమై ముఖములు రెండును చర్మాచ్ఛాదితములై యుండును ఇది ఒకటిన్నర మూరల పొడుగు గలదై ఎడమ ముఖ వ్యాసము 12—18 అంగుళములలోను కుడివైపు ముఖమున ఒకటి లేక అర అంగుళము తక్కువగా ఉండును రక్తచందన దారువుతో నిర్మితమైన మర్దలమునుండి గంభీర ధ్వని వెలువడును భస్మము, ఎర్రమన్ను, మృత్తిక, అన్నము గుజ్జు జిగురు మొదలగునవి మిశ్రణచే తయారైన ప్రలేపమును దక్షిణ ముఖమున లేపనముచేసి ఎడమ ముఖమున పూరిక యొసగుదురు అన్ని విధములైన వాద్య యంత్రములు మర్దలము, మృదంగముతో కూడి యున్నప్పుడే రక్తి కట్టును

### 3. సుషిరములు

పిల్లన గ్రోవి మొదలగు రంధ్ర యుక్త వాద్యములను సుషిరములని యందురు సంగీత విద్వాంసులనేక విధ సుషిరములను వర్ణించియున్నారు అందులో—

వంశి, పావ్యరి, మురళి, మాఘరి, తిత్తిరి, శృంగకాహళము, కాహళము, చుక్క, శృంగిక, స్వరనాభి, శృంగము, కృపాలిక అనునవి కొన్ని విధములు

ఈ వాద్య యంత్రములు వేణువు బోలు కలిగిన కఱ్ఱ, రక్త చందనము, శ్వేత చందనము, హస్తి దంతము, స్వర్ణ రౌప్య తామ్రములోహ స్ఫటికాదులచే తయారు చేయబడును వంశి, వర్తులమై సరళమై పర్వ దోష శూన్యమై యుండవలెను దీని గర్భ రంధ్రము కనిష్ఠ కాంగుళితో తుల్యమై యుండును దీని అగ్ర భాగమునుండి రెండంగుళముల దూరమున నున్న ఫూత్కార రంధ్రమునుండి 5 అంగుళముల దూరమున 7 ఛిద్రములు ప్రతి యొక రంధ్రము మధ్య రెండంగుళముల వ్యవధానముండుటయు సామాన్యకము ఈ ఏడు రంధ్రములును చిన్న చిన్నవై యుండును

మాతంగముని మహానంద, నంద, విజయ, జయాది వేణువుల నాల్గును శ్రేష్ఠమని చెప్పినాడు వీనిని తయారు చేయు విధము పైన చెప్పిన దానికంటె కొంచెము భిన్నముగా నుండును.

వేణువును ఫూత్కార ఛిద్రముపై పెదవి యుంచి ఊదవలెను విశదత్వము, ప్రౌఢత్వము, సుస్వరత్వము, శీఘ్రత్వము మాధుర్య మనునవియైదును ఫూత్కార గుణములు శీత్కారము, బహుళత్వము, స్తబ్ధత్వము, విస్వరము స్ఫుటిత స్వరము లఘుస్వరము అమధురత్వము ననునవి ఆరును అవగుణములు

వృధావాదన, ప్రయోగ బాహుళ్యము అల్పత్వము అనునవి వేణు వూదువాని దోషములు స్థాన, లయాభిజ్ఞత, గమక నిపుణత, స్ఫుటస్వరము శీఘ్రహస్తత్వమనునవి గుణములు ప్రముక్తి, బద్ధముక్తి, యుక్తి, సుస్థానము, సుస్వరత్వము, అంగుళి సారణ మనునవి అంగుళి ప్రసారణ క్రియా గుణములు

### 4 ఘన వాద్యములు

కరతాళము మున్నగు ధాతు నిర్మిత వాద్యములను ఘనవాద్యములందురు ఇవియు అనేక విధములు అందులో

కరతాళము, కాంస్యవనము, జయఘంట, సుత్రక కంఠిక, పటవాద్యము, పట్టఘోషము, ఘర్ఘరము ఝుంఝుతాళము, మంజీరము, కర్తరి, ఉష్కాకము మున్నగునవి కరతాళ విషయమున సంగీతశాస్త్రమున నిట్లు వ్రాయబడి యున్నది

త్రయోదశాంగుళవ్యాసౌ శుద్ధకాంస్య వినిర్మితౌ
మధ్యముష్టి నాకారౌ తన్మధ్యే రజ్జుసంఫితౌ॥
పద్మినీ పత్రసదృశౌ కరాభ్యాం రజ్జుయంత్రితౌ
కరతాళావుభౌ వాద్య సే వాద్యపాటే ఝుంకృతౌ॥

ఇరువది వాద్యవిధ ప్రబంధములను యీ విద్యా ప్రవీణులేర్పరచిరి వాటి పేర్లు యతి, ఉథము, ఓంతవళి, అవచ్ఛేదము, జోడని చంపెని పదము, సమహంసము, ఝుంకారము, పైహారము, తుటుకు, ఊస్వరము, ఢంకారము, మలపము, మలపాంకము, ప్రహరిణము, అంతర, దురక్వరి, యవనిక పుష్పాంజలి కాని సంగీత దామోదరములో 12 ప్రబంధములే చెప్పబడినవి అందులో కొనిమిది పేరులు పైన వ్రాసిన వానికంటె భిన్నములై యున్నవి

సంగీత దామోదరములో

'యతి రోధవ్య వచ్ఛేదో గజరో రుపటం ధ్రువం
గనపః పాటగో నీచవాదళ్చ కలితస్తథా
ప్రహరణం బృందనంచ ప్రబంధా ద్వాదశస్మృతాః॥

ప్రబంధ భేదములవలననే వాద్యముల వివిధ స్వరము లుత్పన్నమైనవి. ([illegible])

శ్రీ తటవర్తి సూర్యనారాయణ

# గ్రంథ విమర్శనము

## ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము

[మొదటి సంపుటము]

కళాప్రపూర్ణ శ్రీవఝ్ఝల చినసీతారామశాస్త్రి

ప్రతులకు: రిజిష్ట్రారు, ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు

వెల 25 రూపాయలు

ఇది, ఆంధ్రశబ్దచింతామణికీ, అథర్వణకారికలకు, బాలవ్యాకరణానికీ, ఇంకా ఇతరాంధ్ర వ్యాకరణాలకు, శ్రీ శాస్త్రిగారు వ్యాఖ్యానరూపంగా రచించిన వ్యాకరణగ్రంథము.

తెలుగులో వ్యావహారికవాదం బయలుదేరిన తరవాత, గ్రాంథికాంధ్రవ్యాకరణాభినివేశం చాలా వరకు సన్నగిల్లింది. కాని వ్యావహారిక భాషకు ఇంతవరకు ఒక సమగ్రమైన వ్యాకరణం బయలుదేరలేదు. అందుచేత వ్యావహారిక రచయితలందరు తమకు తోచిన మార్గాలలో వ్యావహారికరచన సాగిస్తున్నారు.

అంచేత గ్రాంథికాంధ్రం మాత్రమే అది విశ్వవిద్యాలయంలో విద్యార్థుల ప్రశ్నపత్రాలలోను, అక్కడక్కడ కొందరు గద్యపద్య రచయితల వ్రాతలలోను మాత్రమే మిగిలి ఉంది.

మనకింతవరకు వచ్చిన తెలుగు వ్యాకరణాలన్నీ చాలా సంక్షిప్తంగా ఉన్నాయి. ఇంతవరకు వచ్చిన భారతాది గ్రంథాల పద్యభాషకుకూడా కేటిలో సమగ్ర సూత్రీకరణం కనబడదు. నిజానికి ఏ వ్యాకరణమైనా బయలుదేరినపుడు అది అంతకు పూర్వమే ప్రసిద్ధులయిన గ్రంథకర్తల భాషకైనా మార్గదర్శకం కావాలి. తెలుగు వ్యాకరణాలీవిషయంలో చాలా అసమగ్రంగా ఉన్నాయన్న విషయం గిడుగురామమూర్తిపంతులుగారు చాలా కాలంకిందటే సప్రమాణంగా నిరూపించారు. ఉదాహరణకు ఆంధ్రశబ్దచింతామణి ప్రకారం చూస్తే నన్నయ్య భారత ప్రయోగాలే అసాధువులని కొట్టివెయ్యవలసి ఉంటుంది. అయితే-నన్నయ్య వ్యాకరణంప్రకారం అతని భారతప్రయోగాలు కుదరకపోయినంత మాత్రాన పెద్దదోషమేమీ లేదనీ, పాణినిసూత్రాలకు అతీతమయిన పాణినీయసూత్ర ప్రయోగాలే కనిపిస్తున్నాయనీ శ్రీసీతారామశాస్త్రిగారు సమర్థిస్తున్నారు.

కాని సంస్కృతవ్యాకరణంలో ఇల్లాంటి ప్రయోగాలకన్నిటికీ ఒక నిర్ణీతమయిన వ్యవస్థ ఏర్పాటైఉంది. పాణినీయసూత్రాలప్రకారం కుదరని ఈపాణినిప్రయోగాలు చాలా తక్కువ. ఆంధ్రశబ్దచింతామణి ప్రకారం కుదరని నన్నయ్య ప్రయోగాలు అసంఖ్యాకంగా కనిపిస్తున్నాయి. ఈదృష్టితో చూస్తే మనకున్న వ్యాకరణాలతో ఇంతవరకు వచ్చిన సుప్రసిద్ధాంధ్రకవుల ప్రయోగాలకన్నిటికీ లక్షణసమన్వయం కుదరడంలేదు.

శ్రీ శాస్త్రిగారీ తమ వ్యాఖ్యానాల్లో అనేక స్థలాలలో ఆంధ్రశబ్దచింతామణికీ, అథర్వణకారికలకు, బాలప్రౌఢవ్యాకరణాలకు, ఇంకా ఇటీవల బయలుదేరిన వ్యాకరణాలకు మధ్యన బయలుదేరిన పరస్పర వైరుధ్యాలెన్నో ఎత్తి చూపించి, తమ వ్యాకరణ పాండిత్యబలంతో అవ్వన్నీ సమన్వయించడానికి ప్రయత్నించారు.

అయితే ఈ పూర్వాంధ్ర వ్యాకరణాల కన్నింటికీ కలిపి, పాణినీయాని కున్నంత విస్తృతి గాని, ప్రామాణికత గాని లేకపోవడంవల్ల కొన్ని కొన్ని సిద్ధాంతాల విషయంలో పాఠకులు ఇదమిత్థం అని నిర్ణయించుకోవడానికి వీలుపడడంలేదు.

ఉదాహరణకు 'సంహితైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః, నిత్యా సమాసే వాక్యేతు సా వివక్షామపేక్షతే' అనే సంస్కృత వ్యాకరణ సంహితా నియమం తీసుకుందాము. ఈ అనుశాసనం తెలుగు సంధిలో సర్వత్ర అనువర్తించదని శ్రీశాస్త్రిగారు నిరూపించారు. కాని శాస్త్రిగారు తమ గ్రంథపీఠికలో తద్ధితాది విషయాలలో సంస్కృత వ్యాకరణ సూత్రాలే తెలుగుకు అనువర్తిస్తాయనీ, సంస్కృత వ్యాకరణ పరిశిష్ట విషయాలకే తెలుగు వ్యాకరణ కర్తలు సూత్రాలు రచించారనీ వ్రాశారు.

ఇక్కడ సంస్కృత సంహితాను శాసనం తెనుగులో అనువర్తించే విషయం సమగ్ర ప్రయోగ పరిశీలన చేసి తేల్చుకోవలసిన విషయం ఇంతవరకు వచ్చిన వ్యాకరణాలలో ఈ విషయంలో సమగ్రపరిశీలన జరగలేదు శాస్త్రిగారు చేసిన సమన్వయాలు కూడా సంక్షిప్తంగా ఉన్నాయిగాని సమగ్రంగా లేవు ఈ పరిస్థితిలో ఈ సమన్వయానికి సరిపోని ప్రాచీన కవిప్రయోగాలు అపప్రయోగాలేనా అని పాఠకులకు సందేహం కలగడం సహజమే ఇంక ప్రసిద్ధ ప్రాచీన కవులలో వీరు ప్రామాణికులు—వీరు అప్రామాణికులు అని కొట్టివెయ్యడం కూడా అంత తేలికైన పని కాదు ఇల్లాంటప్పుడు — శ్రీ శాస్త్రిగారు కొంతమంది ప్రాచీన కవుల ప్రయోగాలు ప్రత్యేకించి అపప్రయోగాల నిర్ణయించడం వ్యాకరణసంప్రదాయదృష్ట్యా యుక్తియుక్తం కాదు

అయితే ఈ చెప్పినదంతా ఆంధ్ర వ్యాకరణ ప్రాథమిక సంప్రదాయాలను గురించి చేసిన విమర్శ ఇదంతా గతానుగతికంగా వస్తుందని విడిచిపెట్టి, కేవల సాంప్రదాయికాంధ్రవ్యాకరణదృష్టితో పరిశీలించినప్పుడు—శాస్త్రిగారి ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వమువంటి సమగ్ర వ్యాకరణగ్రంథం తెలుగు భాషకు ఇంతవరకు ఎన్నడూ బయలుదేరలేదని చెప్పాలి

శాస్త్రిగారు సంస్కృత ప్రాకృతాంధ్ర వ్యాకరణాలు కూలంకషంగా మథించినవారు ఈ వ్యాఖ్యానంలో దొర్లిపోయే అనేక సంస్కృతాంధ్ర శబ్దాల సాధుత్వాసాధుత్వ నిర్ణయాలలో, వీరి కూలంకష పాండిత్యము, చిరకాలానుభవము, ప్రయోగ విశేష పరిజ్ఞానము ప్రస్ఫుటంగా గోచరిస్తాయి

గ్రాంథికాంధ్ర వ్యాకరణ సంప్రదాయాలు, ప్రయోగ విశేషాలు, సూత్రకర్తల లోపాలు మొదలయిన భాషావిషయాలు తెలుసుకోదలిచిన వారందరికీ ఇది అవశ్య పఠనీయమయిన ఉత్తమగ్రంథము

ఇది ఇంతవరకు పూర్వం వెలువడిన గ్రాంథికాంధ్ర వ్యాకరణాల కన్నింటికీ మహాభాష్యంవంటిదని చెప్పవచ్చును

అయితే శాస్త్రిగారి భాష్యరచనతో తృప్తిపడక అపూర్వమయిన తమ పరిశ్రమను వినియోగించి భాష్యరూపంలో వెలువరించిన తమ అభిప్రాయాలు సూత్రీకరించి గ్రాంథికాంధ్రాని కొకసమగ్ర వ్యాకరణం రచింపగలరనీ, ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వ్యాకరణం ప్రచురించే గౌరవం దక్కగలదనీ ఆశిస్తున్నాను

ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వం రాయల్ సైజులో సుమారు వెయ్యి పుటల గ్రంథం. చింతామణ్యాది వ్యాకరణసూత్ర సూచికలు, విస్తృత విషయసూచికలు మొదలయిన వాటితో గ్రంథ ముద్రణం ప్రశంసనీయంగా ఉన్నది

ఇంతటి ఉత్తమ వ్యాకరణగ్రంథం ప్రచురించిన ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు ఆంధ్రభాష కొక అమూల్యాలంకారం చేకూర్చారు

ఆంధ్రభాషాభిమానులందరికీ ఇది అవశ్యం పఠింపదగిన అమూల్య వ్యాకరణ గ్రంథము

---

## నాటకం

[అనువాద నాటకం]

వి. వి. వరదరాజా, ప్రకాశకులు దేశి కవితా మండలి, విజయవాడ 2, వెల రూపాయి పావలా

అసలిది హంగరీ కవి ఫెరెన్స్‌మోల్నార్ వ్రాసిన నాటకం ఈ నాటక రచనాచమత్కృతికి ముగ్ధుడై పి. జి. వుడ్‌హౌస్ అంతటి రచయిత దీనికి "*The play is the thing*" అని పేరుపెట్టి ఇంగ్లీషులోకి తర్జుమా చేశాడు ఆ ఇంగ్లీషులోనుంచి వి. వి. వరదరాజాగారు చేసిన తెలుగుఅనువాదమే ఈ 'నాటిక'

ఊర్వశి, మధు, అనే ఇద్దరు యువతీయువకులు పరస్పరము ప్రేమించుకుని వివాహం చేసుకుందామని నిశ్చయించుకుంటారు అయితే ఇంతకు పూర్వమే ఊర్వశికి నాట్యం నేర్పిన కాలంలో బాగా దోస్తీగా తిరిగిన కామరాజనే ఆసామి ఆమెను ఒక హోటల్లో కలుసుకుని సరసాలాడడం మొదలు పెడతాడు కాని ఊర్వశి తన పెళ్ళి నిశ్చయం అతనికి చెప్పి తిరస్కరిస్తుంది. ఈ హోటల్లో పక్కగదిలోనే మధు, అతని సన్నిహితమిత్రులు రఘుపతి, రామానుజం మకాం చేసిఉంటారు. మధు ఈ సంభాషణ విని,

నిర్ఘాంతపడి ఊర్వశితో తెగతెంపులు చేసుకోడానికి సిద్ధపడతాడు. కాని రఘు, రామానుజుడు, మధుమీద జాలికొద్దీ అట్టే రభస జరక్కుండా ఈ వ్యవహారం సానుకూలపరచి పెళ్ళి జరిగించాలని నిశ్చయించి, మధుతో ఆసంభాషణ అంతా ఒక నాటకం రిహార్సల్లోదని చెబుతారు. స్వయంగా అప్పటికప్పుడు ఒక చిన్న నాటకం వ్రాసి, ఊర్వశీ కామరాజు లిద్దరిచేతా ఆ నాటకం ఆడిస్తారు. పాపం మధు భావకవి. ఆ అమాయకుడు ఇదంతా నమ్మి, చివరికి ఊర్వశీ పాణిగ్రహణోన్ముఖుడవుతాడు. ఇదే ఈ నాటకంలో కథ.

ఈ కథ సామాన్యంగానే కనిపిస్తుంది. కాని షెరన్స్ లారెన్స్ మాత్రం ఇదంతా మూడంకాల్లో ఇమిడ్చి, అత్యద్భుతంగా నడిపించుకుపోయాడు. ఈ రూపక రచనావిధానం అంతా సరికొత్తగా అతి సున్నితమైన హాస్యధోరణిలో సాగిపోతుంది.

దీనికి డి. వి. నరసరాజు గారు చేసిన అనువాదం కూడా చాలా చక్కగా నడిచింది. వీరి సంభాషణలు మంచి చురుగ్గా హుషారుగా సాగిపోతాయి. రచనకు, ప్రదర్శనానికీ, ఆంధ్ర నాటక కళాపరిషత్తు ప్రథమ తాంబూలం అందుకున్న వీరి 'నాటకా'న్ని గురించి, ఇంతకంటె ఎక్కువగా వ్రాయడం అనవసరం.

అయితే—ఒక యువతికి ముందుగా ఒక ఆసామితో బాగా దగ్గర సంబంధం ఏర్పడడం, తరవాత ఆమె ఇంకొకర్ని పెళ్ళాడాలని అనుకోవడం—పాత గోల బయటపడడం—మధ్యవర్తులు కలుగజేసుకుని వ్యవహారం చెయ్యిదాటిపోకుండా చూడడం—లాంటివి పాశ్చాత్యసంఘానికి నప్పినంతగా మనకు నప్పవు. ఇందుచేత తెలుగుజనానికి ఈ నాటకం కొంత విడ్డూరంగా కనబడుతుంది.

ఆంధ్ర నాటక కళాపరిషత్తు మన సంఘ వ్యవస్థకు బాగా హత్తుకుపోయే స్వతంత్ర నాటకాలుగాని లేకపోతే—అనువుపడే అలాంటి అనువాదాలుగాని ప్రోత్సహించడం మంచిది.

## సింహగడము

[నాటకము]

సురభి నరసింహము. బి. యే, బి. యి డి. ప్రకాశకులు అరుణా ప్రెస్సు, నడకుదురు. కాకినాడ తాలూకా, తూర్పుగోదావరి జిల్లా.

ఈ నాటకంలో ప్రధానేతివృత్తం సింహగడ విజయము. ఈ విజయం సాధించిన వీరుడు తానాజీ మాలుసురే. ఇతడు శివాజీకి నమ్మినబంటు. తన చాకచక్యంవల్ల సింహగడదుర్గరక్షకుడైన రాయాజీ ఘోరేసరుని తన పక్షానికి తిప్పుకుంటాడు. ఈ కథలో ఉదయభానునికీ, కమలకుమారికీ మధ్య నడిచిన వ్యవహారం కూడా కలుస్తుంది. రచయిత ఇదంతా ఆరుఅంకాలలో కుదించారు.

సాంప్రదాయిక పద్ధతి ననుసరించిన పద్యాలూ, పాటలూ, గ్రాంథిక భాషారచన మొదలైనవన్నీ ఈ నాటకంలో కనిపిస్తాయి.

చారిత్రక రూపకాలు వ్రాసేటప్పుడు ఆకాలపు ప్రజల మనోభావాలు స్ఫురింపజెయ్యడంలో చాలా జాగ్రత్త పడాలి. శివాజీకాలంలో హైందవ ధర్మోద్ధరణావేశం ఉంటే ఉండవచ్చునుగాని, ఈనాడు బయలుదేరిన అఖిలభారతజాతీయావేశంలాంటివి ఆరోజుల్లో కనబడదు. అందుచేత ఈ నాటకంలో చాలాచోట్ల మరాటీవీరులు 'భారత వీరత' మొదలైనవాటిని గురించి ప్రస్తావించడం సముచితంకాదు. రచయిత ఇక్కడ ఈనాటిభావాలు ఆనాటి వ్యక్తులకు హత్తించినట్లు కనిపిస్తుంది.

ఈరచయిత నాటకరచనకంటె పద్యరచన కొంత బాగుంది. ఈ క్రింది పద్యాలనుబట్టి వీరి రచనా పద్ధతి గమనించవచ్చును.

"ఓహో! ఆహవలక్ష్మియే మనకుఁ
    బ్రత్యక్షాన మిచ్చెందహో
రాహిత్యమ్మొనరించి, శాత్రవ కర
    గ్రస్తంబులౌ దివ్యలన్
వ్యూహమ్ముల్ పచరింపుడీ రిపుల
    కాయుర్దీపమార్పన్నటో
త్సాహావేశ పరాక్రమ ప్రళయ
    రుద్రస్ఫూర్తి వర్తింపుడీ!
ప్రాణమ్ముల్ తృణభంగురమ్ములు
    తటిత్ప్రాయంబు లాత్రీలు, కోం
డాణిన్ శాత్రవముక్తఁ జేసి
    శివరాట్పత్రావగీతించి, గీ
ర్వాణ ప్రస్తుతు లెపుమీర
    శివజీపాదోపకీవుల్ పరి

ప్రాణోద్యోగు లటంచు శాశ్వత
సువర్ణభాగ్యతి దీపింపరే!"

## TWELVE PEAS IN A POD

[కథల సంపుటి]

మాగ్నొల్లావార్డ్డీ ఆథర్స్ అండ్ ఆర్టిస్ట్స్ ఎసోసియేషన్ 16 బాండ్ సన్స్ గార్డెన్ స్ట్రీట్ తిల్పాక్. మదరాసు వెల: 2 రూపాయలు

ఇది భారతదేశ పరిసరాలపై ఆంగ్లభాషలో రచించిన 12 కథల సంపుటి

పై దేశీయులు అన్యదేశాలలో చాలాకాలం నివసించినా ఆ దేశీయుల ఆచారవ్యవహారాల అంతరాంతరాలు పరిశీలించి ఎన్నదగినసాహిత్యసృష్టి చెయ్యటం చాలాకష్టం అసలాయా దేశీయుల జీవితాంతర్యం వారి దైనందిన వ్యావహారిక భాషలో అంతర్లీనమై ఉంటుంది అందుచేత విదేశభాషల్లో అన్యదేశీయుల జీవితపరిసరాలు చిత్రించటంలో కొంత క్లిష్టత ఏర్పడుతుంది

కాని ఈ రచయిత్రి రచనలలో అంతటా చక్కని భారతీయ జీవన పరిశీలన కనిపిస్తుంది కథలు చదువుతూంటే ఇవి ఎవరో భారతీయులు వ్రాసినట్లే ఉంటాయి గాని పైదేశీయ దృష్టి ఛాయలు వీటిలో కనబడవు ఇది ఈ రచయిత్రి కథలలో ఎన్నదగిన ప్రత్యేక విశిష్టత

ఈసంపుటికి పీఠిక రచించిన మంజేరీ యీస్ ఈశ్వరన్‌గారు వ్రాసినట్లు ఈమె కథల్లో సున్నితమైన స్వభావపరిశీలనము, చిత్రణము ప్రత్యేకంగా పేర్కొనదగిన గుణాలు ఈ జాతి రచనలకు *Twixt Here and there, Renunciation, The Goldsmith Finishes His work* అన్నవి ఉదాహరణలుగా తీసుకోవచ్చును

ఈమె వ్రాసిన కథ లన్నిటిలోను, *One night in a Barn, A question of Authorship* అన్నవి రెండు ప్రత్యేకంగా పేర్కొనదగిన ఉత్తమ కథలు

మిగిలిన వాటిలో చాలావరకు చిత్రణాల తరగతి కెందుతాయి వీటిలో *The call of the eights* ఎన్నదగిన చిత్రణం కవిత్వార్ద్రమైన ఒక సన్నివేశం తీసుకొని రచయిత్రిని ఉన్నత పథాలకు తీసుకొనిపోయిన మాగ్నొల్లావార్డ్డీ రచనాకౌశలం దీనిలో గమనించతగ్గది

ఆకర్షకమైన ముఖచిత్రంతో ముద్రణాదికం ప్రశస్తంగా ఉన్నది

ఈ ఉత్తమాంగ్ల కథాసంపుటి ప్రచురించిన ఆథర్స్ అండ్ ఆర్టిస్ట్స్ సంఘంవారు అభినందనీయులు

## శబ్దసింధు

[హిందీ–తెలుగు నిఘంటువు]

సంకలనకర్త వాగిసత్యనారాయణగారు. ప్రచురణ: విజయ భారతీ పబ్లికేషన్స్, రాజమహేంద్రవరము వెల 13 రూపాయలు

ఇది డెమ్మీసైజులో 1278 పుటలుగల పెద్దనిఘంటువు దీనిలో 75 వేల పదాలున్నాయి సాధారణంగా హిందీలో చేరిపోయే సంస్కృత, పార్శీ, ఉర్దూ, అరబ్బీ మొదలైన భాషలపదాలన్నీ సేకరించి, అకారాది క్రమంలో ఇందులో చేర్చారు ఇవిగాక, ఇందులో ఇంకా 5 వేల హిందీ జాతీయాలు కూడా చేరి ఉన్నాయి

హిందీ జాతీయ భాషగా మారిన ఈ రోజుల్లో అందరూ ఈ భాష తప్పకుండా చదవవలసిన అవసరం ఏర్పడింది తెలుగులో ఇంతవరకు ఇంత పెద్ద హిందీ—తెలుగు నిఘంటువు బయలుదేరలేదు ఇది హిందీభాష చదివేవారికి బాగా ఉపయోగిస్తుంది ఇంత పెద్ద నిఘంటువు తెలుగులో ప్రకటించడానికి శ్రమపడిన ప్రకాశకులు, సంకలనకర్తలైన వాగి సత్యనారాయణగారు హిందీభాష చదివేవారికి చక్కని సౌకర్యం కలిగించారు

## విక్రమప్రకృతి

[పద్యకావ్యము]

యామిజాల పద్మనాభస్వామి, శారదా విద్యాలయ బాలికోన్నత పాఠశాల, త్యాగరాజనగర్, మదరాసు వెల లేదు

ఇది జయపురమార్గంలో తగిలే కొండదారి ప్రకృతిసౌందర్యం వర్ణించే ఏకాశ్వాస పద్యకావ్యము

ఈ కావ్యంలో అక్కడక్కడవచ్చే ప్రకృతి వర్ణనలతోపాటు శైలివర్ణ వస్తువులు, మొదలయినవాటి గొడవలుకూడా అక్కడక్కడ దొర్లుతూంటాయి ఇందులో కేవల ప్రకృతివర్ణనలే కాక, జయపుర రాజ్యంలో నివసించే మనుషుల సాంఘిక వర్ణన కూడా కనిపిస్తుంది

విక్రమప్రకృతిలో పద్యాలన్నీ సాంప్రదాయికమార్గంలో సాఫీగా నడిచిపోతూంటాయి పదప్రయోగము, సమాసాలకట్టుబడి, చక్కని జాతీయ మార్గంలో నడిచాయి అయితే వృత్తరచనల్లో ఈ రచయిత కంతగా చెయ్యితిరిగినట్టు కనబడదు ప్రధానంగా ప్రకృతివర్ణనపరమైన ఈ కావ్యంలోని వర్ణన అక్కడక్కడ ఉదాత్తమార్గం విడిచి, చాలా తేలికంగా తేలిపోతూంటుంది అయితే ఈ క్రింద ఉదాహరించిన వర్ణనవంటివి అరుదుగా ఉన్నా, దీనినిబట్టి ఈ రచయిత ఉత్తమస్థాయి ఏ అంతరువు దాకా వెళ్లిందో గ్రహించుకోవచ్చును

“కుదురుగ మంచిగంధపు జిల్లె
    కొల్లను గప్పుకొంచు ం
వద కలవారిపోల్కి మదవారణ
    కుంభ విరాజియాత్తికా
ప్రసగళ భ్రామానలయి
    పాటలు పాడుచు నచ్చటచ్చటన్
మెదలుచు నుందురందు గను
    నీటుగ భిల్లపురంధ్రి కామణుల్

## భక్తి తత్త్వము

శ్రీ నిర్వికల్పానందస్వామి ప్రకాశకులు సాధన గ్రంథమండలి, తెనాలి వెల 12 అణాలు

నారద భక్తిసూత్రాలు సంస్కృత భక్తి తత్త్వంలో ప్రామాణిక గ్రంథం నిర్వికల్పానంద స్వామిగారు ఆ గ్రంథంలోనివిషయం సంగ్రహంగా క్రోడీకరించి తెలుగులో తేటతెల్లంగా వివరించారు

ఇది క్రౌను సైజులో 60 పుటల గ్రంథం అయినా మొత్తంగా నారదభక్తి సూత్రంవిషయం అవగాహన చేసుకోగోరేవారికి ఇది బాగా ఉపయోగిస్తుంది

## గౌతమ బుద్ధ
### (జీవిత చరిత్ర)

చెరుకూరి వీరయ్య ఎమ్ ఏ ఎల్, ఎల్. టి, ప్రకాశకులు పి ఆర్ అండ్ సన్స్ విజయవాడ. వెల 1-8-0

రచయిత దీనిలో గౌతమబుద్ధుని చరిత్ర సంగ్రహంగా వ్రాశారు. అయితే ఉన్నంతలో దీనిలో ప్రతి ప్రకరణంలోను, బుద్ధుని జీవితచరిత్ర విశేషాలు సర్వబోధనలు పూర్తిగా వచ్చాయి

దీనిలో వాడిన భాష గ్రాంథికమే అయినా చాలా చక్కగా సరళంగా నడిచింది

---

## రామనామ ప్రభావము

శ్రీ కందుకూరి వెంకటవరదయ్య ప్రకాశకులు సాధన గ్రంథమండలి, తెనాలి వెల 6 అణాలు

ఆర్ష గ్రంథాలలో గల రామనామ ప్రశస్తిపరమైన శ్లోకాలన్నీ సేకరించి రచయిత దీనిలో రామనామ ప్రభావం సంగ్రహంగా వివరించారు

రామనామ వ్యుత్పత్తి, జపవిధానము మొదలైనవన్నీ తెలిసికోదలచినవారికి ఈ గ్రంథం ఉపయోగిస్తుంది

---

## అంబికా విజయం

పురాణపండ రామమూర్తి భారతీ ముద్రణాలయము ఆలమూరు వెల: 12 అణాలు

శారదా నవరాత్రులు జరపడం ఆంధ్రదేశంలో అనూచానంగా వస్తున్న సంప్రదాయము ఈ పుస్తకంలో రచయిత దేవీపూజావిషయంలో పురాణ ప్రసిద్ధమైన మాహాత్మ్యాలు, కథలు సేకరించి సరళ వ్యావహారిక శైలిలో సర్వులకు బోధపడేటట్లు వ్రాశారు.

కాని వ్యావహారికంలో అక్కడక్కడ గ్రాంథిక శైలికూడా కనిపిస్తుంది. రచయిత ఈ విషయంలో జాగ్రత్తపడటం అవసరం

## బాపూ—నా తల్లి

కుమారి మనూగాంధి అనువాదకుడు నందూరి వెంకటకృష్ణమాచార్యులు సర్వోదయ సాహిత్య పరిషత్తు. హంసినిఅలంకొడ్డు హైదరాబాదు (దక్కన్) వెల పన్నెండు అణాలు.

కుమారి మనూగాంధి గాంధీజీతో నౌఖాలీ సంచారం చేసినప్పుడు అనాటి స్మృతులన్నీ గుజరాతీ భాషలో దినచర్యరూపంలో వ్రాసింది దానికి నందూరి వెంకటకృష్ణమాచార్యులుగారు చేసిన అనువాదమే ఈ గ్రంథం

సామాన్యమయిన గాంధీజీ దైనందిన చర్యలో జరిగిన మహత్తర సంఘటన లెన్నో మనూగాంధీ పాఠకుల కళ్ళకు కట్టినట్టు వ్రాసింది ప్రతి చిన్న విషయంలోను మహాత్ముని దృక్పథం ఎంత విశాలంగా పనిచేసిందో ఈ చిన్న పుస్తకంవల్ల స్పష్టపడుతుంది

అనువాదం అంత జాతీయంగా లేకపోయినా మూలగ్రంథంలోని విషయాలన్నీ పాఠకులకు సులభంగా తెలుస్తున్నాయి

## శ్రీ కుసుమహరనాథ లీలాసంగ్రహము

కొత్తపల్లి బుచ్చయ్యాశర్మ పాలమూరు, పశ్చిమ గోదావరిజిల్లా వెల ఒకరూపాయి

దీనిలో గ్రంథకర్త కుసుమహరనాథుని జననము, జీవితవృత్తాంతము సంగ్రహంగా వ్రాశారు.

జీవితవృత్తాంతం తరవాత రచయిత హరనాథ లీలలు, హరనాథసందేశము మొదలయిన విషయాలు కూడా చేర్చారు

హరనాథతత్త్వం తెలిసికోగోరేవారందరికీ ఈగ్రంథం సంగ్రహప్రకాశికగా ఉపయోగించగలదు

---



ఖండకావ్య సంపుటి

శ్రీ రాధాకృష్ణ ప్రెస్ రామచంద్రపురం— వెలలేదు దీనిలో కె. వై రా, శ్రీపాద వెంకటరత్నం, వాడ్రేవు నారాయణమూర్తి, పొన్నపల్లి వెంకటకృష్ణయ్య, రావులపర్తి భద్రిరాజు, పోతుకూచి సూర్యనారాయణమూర్తి అనే అయిదుగురు యువకవుల ఖండకావ్యాలున్నాయి.

ఈ ఖండకావ్య సంపుటికి పోతుకూచి సూర్యనారాయణమూర్తిగారు రెండు విపులపీఠికలు రచించారు. దీనిలో వీరి కవిత్వాభిప్రాయాలలో ఎక రస్వాల్లి అతివాదులు అంగీకరించక పోవచ్చునుగాని సామాన్య సారస్వతోపాసకు లందరు ఇది తప్పకుండా అంగీకరించే విషయాలే

ఈ రచయితల రచనలలో గేయాలు, పద్యాలు మొదలైన ఆధునికరచనాపద్ధతులన్నీ కనిపిస్తున్నాయి వీరందరు కొత్త కొత్త దారులలో రచనాపద్ధతి సాగించారు. వాడ్రేవు నారాయణమూర్తిగారి 'చంచలుడు' సున్నితమైన హాస్యంతో హాయిగా నడిచి పోతుంది

కె వై రా వ్రాసిన జీవిత, జ్యోత్స్న, కాయన వ్రాసిన రచనలలో ఉత్తమంగా ఉన్నాయి.

పొన్నపల్లి వెంకటకృష్ణయ్యగారు వ్రాసిన రచనలో ఉగాది—విశ్వశ్రీ అనే ఖండకావ్యం బాగుంది

రావులపర్తి భద్రిరాజుగారికి గేయరచనలు భావకవితాపద్ధతి అనుసరిస్తున్నాయి.

మొత్తంమీద ఈ రచయిత లందరిలోను యువకోత్సాహము, నూతన రచనా ప్రభావాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. క్రమంగా వీరు తమ రచనలలో పరిణతి పొందగలరని అక్కడక్కడ మంచి సూచనలు కనిపిస్తున్నాయి.

---

## ఆర్య ప్రవర్తనము

పండిత ... కేశవాచార్య సిద్ధాంతిశాస్త్రి

ప్రకాశకులు ఆర్యసమాజము గోషామహల్, హైదరాబాద్ (దక్కన్) వెల ఆరణాలు

ఇది హిందీభాషలో పండిత రామనారాయణ మిశ్ర వ్రాసిన భారతీయ శిష్టాచార్ అనే గ్రంథం ఆధారంగా తీసుకుని రచించిన గ్రంథమని గ్రంథకర్త తమ పీఠికలో తెలియజేశారు.

ఇది ఆర్యసమాజం ధర్మపద్ధతిని అనుసరించి వ్రాసిన పుస్తకము

దీనిలో విద్యార్థులు ముఖ్యంగా దైనందిన జీవితంలో అవలంబించవలసిన నియమాలను గురించిన వివరాలున్నాయి

అయితే ఈ విషయాలు ఆర్యసమాజస్థు లయిన విద్యార్థులే కాక తదితర విద్యార్థులు కూడా అనుదినము ఆచరణలో పెట్టదగినవిగా ఉన్నాయి.

దీనికి సూరవరపు కుమారస్వామిరావుగారు పీఠిక రచించారు ఇది విద్యార్థు లందరు చదువవలసిన పుస్తకము

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad




మద్రాస్ స్టేట్ హాండ్‌లూం వీవర్స్
కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
ఎగ్మూరు — మద్రాసు



# అతని ప్రాణాలన్నీ ఆమె మీదనే

అతనంటాడు, భార్య అన్నప్పుడు, అన్ని విధాలా తన భార్యవలెనే ఉండాలని. అందుకు కారణం, ఆమె మెలకువలో ప్రవర్తిస్తుంది.

ఆమె చాల చురుకైనది. ఉదయం పూట భర్తకు ఆఫీసుకు కావలసిన దుస్తులన్నీ తీసి సిద్ధంగా వుంచుతుంది. సాయంత్రం అతడు ఇంటికి చేరుకోగానే రుచివంతమైన ఒక గ్లాసుడు 'టీ' చేతికందిస్తుంది. ఆ 'టీ' చేయడానికి అట్టే ఖర్చు కూడా కాదు.

తియ్యని ఆమె చిరునవ్వువలెనే ఆమె చేతి 'టీ' కూడా అతడిని ఎం వశం చేస్తుంది. అందు చేతే అతని పంచప్రాణాలు ఆమె మీదనే పెట్టుకున్నాడు.

మంత్ర శక్తి నిచ్చే పానీయం

"టీ" త్రాగండి



సెంట్రల్ "టీ" బోర్డువారిచే ప్రచురించబడినది.




విజయ వారి

# పెళ్లి చేసి చూడు

నటులు: జి. వరలక్ష్మి, ఎన్. టి. రామారావు,
సావిత్రి, జోగారావు, దొరస్వామి, డా. శివరామకృష్ణయ్య,
రంగారావు, పుష్పలత, వెంకయ్య, కుందు, బేబి గిరిజ,
బాలకృష్ణ, పద్మనాథం వగైరా





డైరెక్టర్.... ప్రసాద్ .... నిర్మాతలు.. నాగిరెడ్డి.. చక్రపాణి